# బోధనా పద్ధతులు

## చరిత్ర - సివిక్సు - భూగోళము

(ట్రెయినింగు పాఠశాలల 1940 సంవత్సరపు నూతన విద్యాప్రణాళిక
ననుసరించి వ్రాయబడినది.)

రచయిత:

మండలేముల వేంకటశాస్త్రి, బి. ఏ., ఎల్. టి.,

డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, తాడేపల్లిగూడెం.

వేంకట్రామ అండ్ కో.

బెజవాడ - మద్రాసు.

**1942**

వెల: 0—12—0

హెచ్చింపు ధర : 0—4—0.

# ముందుమాట

1939 సం॥రమున ప్రాథమిక విద్యాప్రణాళికను విద్యాశాఖవారు సంస్కరించి యమలులోనికి దెచ్చిరి. రెండేండ్లు కావచ్చినను దీని యుపయోగ మంతగా కానరాకున్నది. ఉపాధ్యాయులందఱు పూర్వపద్ధతులలో తయారైనవారు గనుక దీనిని పూర్తిగ ననుసరింపజాలకున్నారు. దీనినిబట్టి ట్రెయినింగు పాఠశాలల విద్యాప్రణాళికనుగూడ మార్చవలసి వచ్చినది. 1940 సం॥రమున నీ సంస్కరణమును జరిపి వెంటనే యమలుపఱచిరి. క్రొత్తసిలబసు ప్రకారము ప్రాథమిక పాఠశాలలోని విషయము లన్నిటిని బోధించు పద్ధతులను నేర్పుట ముఖ్యావసరమైనది. ఈ యవసరమున పనికివచ్చుటయే ఈ చిన్ని పుస్తకమును రచించుటకు గారణము.

అన్ని విషయములకు నన్వయించు బోధనాపద్ధతులు సర్వసాధారణముగ నందఱు నేర్వదగినవి. ప్రత్యేక విషయముల (Subjects) కు గల ప్రత్యేకపద్ధతులనుగూడ నుపాధ్యాయ విద్యార్థులు గమనించుట యవసరము. ఈ పుస్తకమున 'చరిత్ర, సివిక్సు, భూగోళము' అను విషయములకు పనికివచ్చు పద్ధతులుమాత్రము చర్చింపబడినవి. బోధకుల కుపయోగపడు సూచన లిందుగలవు. సందర్భానుసారముగ నుపాధ్యాయులు స్వయంకృషిచే గ్రహించిన యితరవిషయములగూడ జేర్చి బోధించవలయును. అప్పుడు వారి బోధన రసవంతమగును. ఈప్సితార్థ సంసిద్ధి [illegible]

ది. 21-10-1940
తాడేపల్లిగూడెం.

మం. వేంకటశాస్త్రి.

# విషయసూచిక

## చరిత్ర



## సివిక్సు

# భూగోళము

# బోధనాపద్ధతులు

## చరిత్ర - సివిక్సు

మొదటిభాగము - చరిత్ర

### 1. సాధారణవిషయములు ( General )

ప్రాథమిక విద్యాప్రణాళికను సంస్కరించి విద్యాశాఖవారు 1939 సంవత్సరమున ప్రకటించిరి. అనుక్రమముగ జరుగుచున్న విద్యావిధానమున ప్రస్తుత దేశకాలపరిస్థితుల కనుకూలములగు కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్టిరి. మన దేశీయవాదుల మన్ననకు మిక్కిలి పాత్రమైన 'వార్ధా విద్యావిధానము' నందలి ముఖ్యవిషయములు చాలవరకు దీనిలో పొందుపఱచియుండిరి. విద్యార్థుల కనువగు శరీర వ్యాయామమునకును, వృత్తివిద్యయందభిరుచి కలుగునట్లు సాధారణముగ పనికివచ్చు గృహావరిశ్రమలకును, గానకళకును మంచి ప్రాముఖ్య మేర్పడినది. బడితోటలను పెంచు విధానమును, మంచి బడితోటలు విద్యావిధానమున నెట్లావశ్యకము లగుచున్నదియు నిరూపించిరి. భాష, గణితము, చరిత్ర మున్నగు విషయములకు క్రొత్త మెఱుగు కలిగినది. విద్యార్థుల జీవితమున కివి తోడ్పడునట్లు ప్రణాళికనుతయారు చేసిరి. 'సివిక్సు' పూర్వము నామమాత్రముగ నుండెడిది. ఇప్పుడు దీని ప్రాముఖ్యమును పూర్తిగ గుర్తించి, యాదర్శకతో

డగు పౌరుని (citizen) గ తయారుచేయుట కుపయోగపడు నట్లు నిర్ణయించిరి. ఈ క్రొత్త సిలబసు ననుసరించి 'చరిత్ర' ను, 'సివిక్సు' ను బోధించు క్రమమును ట్రైనింగుపొందు విద్యార్థులు గమనించవలసియున్నది.

## చరిత్ర బోధించుటలో గల అవకాశములు
### ( Scope of History )

1. చరిత్రయందలి విషయములు కాలక్రమమున జరిగినవి. నవీన విషయములకు పూర్వవిషయములు పునాది వంటివి. పూర్వవిషయములు జరిగియుండనిచో నిప్పటి విషయములు జరుగనేరవు. ఈ కార్యకారణ జ్ఞానమును బాలురలో కలిగించవలయును.

2. విషయములనుబట్టి చరిత్ర కాలవాహినిలో జరుగు నాటకమువంటిది. పూర్వుల యాచార వ్యవహారములు, ఆర్థిక పరిస్థితులు, పరిపాలనావిధానము, నాగరికత మొదలగు వివరములను చారిత్రకు లూహించి, మనకు లభించు కొన్ని నిదర్శనములను బట్టి గ్రహించి వివరించినదే చరిత్ర. కావున విషయముల కాలనిర్ణయమును తెలుసుకొనుట యవసరము.

3. సమానములుగ దోచువిషయములలో సాదృశ్యమును, వివిధములందలి వ్యక్తిత్వమును గ్రహింపజేయుటకు చారిత్రకులు ప్రయత్నింతురు. మహాపురుషుల జీవితములు కొన్ని ముఖ్యవిషయములలో నొకదానినొకటి పోలియుండును. కాని యొక్కొక్క జీవితమునకును ప్రత్యేకత గలిగించు నంశములు

కనబడుచుండును. అన్యజాతీయులతోను వర్తించు సాధారణ వ్యవహారములలో సాదృశ్యము లేక ఏకీభావము గలదు. అందలి తెగలలో భిన్నత్వము కనబడుచుండుట మన మెఱిగిన విషయము.

4. పూర్వచరిత్ర, ఆశయములు, వివిధవిషయము లందలి యనుభవములును మనకు వచ్చినవి. వాని యుపయోగమును సంపూర్ణముగ ననుభవించు భాగ్యము మనకు గలదు. వీనిని భద్రముగ సంరక్షించి, మనకు సాధ్యమగు మెఱుగుదిద్ది మన తరువాతవారి కందజేయు బాధ్యత మన యందు గలదు. దీనిని గుర్తింపజేయుటకు చరిత్రలో మంచి యవకాశము గలదు.

5. కేవలము మహాపురుషుల జీవితములును, యుద్ధములును, చరిత్రకు ప్రధానములు గావు. దేశమందలి ఆయా కాలములలోగల ప్రజల యార్థిక, సాంఘిక, జాతీయ, మత పరిస్థితులను బాలురచే గమనింపజేయుట ముఖ్యము. దీనియం దాసక్తి కలుగజేయనిచో నిజమగుచరిత్రను బాలురు గ్రహింపజాలరు. విద్యార్థులమనస్సున కాకర్షకములుగ వీనిని బోధింపగలుగుట యుపాధ్యాయుని కర్తవ్యము.

చరిత్రను చదువునపుడా యా మహాపురుషుల జీవిత రహస్యములను బాలురు గమనింపవలయును. ఆ కాలమున వారితో తాము జీవించుచున్నట్లు తాత్కాలికముగ నూహింపవలయును. లేనిచో వారికి పూర్వవిషయములం దాసక్తి కలుగదు. ఏనాడో జరిగిన విషయములతో తమ కేమి నిమిత్త

మనుష్యులు వారికి తోచకూడదు. వారియు మహాపురుషులు ప్రవర్తించిన మార్గములను బట్టి తామును పోవలయును అని కుతూహలపడునట్లుపాధ్యాయుడు ప్రయత్నించవలయును. ఛత్రపతిశివాజీ మహామహుడు అగుటకు కారణమేమి పరిపారిహాస్య మని నిరూపించవచ్చును. నాటి యార్థిక సాంఘిక విషయములను నేటివానితో సరిపోల్చి వ్యత్యాసములను, వానికి గల కారణములను గుర్తింపజేయవలయును. అట్లు చేయుటచే చరిత్రను జదువుటయందాసక్తి తప్పక కలుగును.

<u>విద్యావిషయికముగ ప్రాముఖ్యమేమనగా:</u> చరిత్రను చదువునపుడు దానియందలి విషయములు ముమ్మాటికి సత్యములని బాలురు గమనించవలయును. మొదటినుండి చివరివరకును చరిత్రయందు <u>దీసత్యప్రమాణము</u> నిలిచియున్నది. హృదయాకర్షణమునకును, దేశభక్తికి, మతప్రాబల్యమునకును తోడ్పడ గలవని యసత్యవిషయములను చరిత్రలో పొందుపరుపరాదు. చారిత్రకుడు తనకు లభించు విషయములలో సత్యములుగ నమ్మిన వానిని మాత్రమే గ్రహించి మిగిలినవానిని దూరముగ త్రోయును. బాలురుకూడ తమ గ్రామచరిత్రను, కుటుంబచరిత్రను, స్థానికచరిత్రను తయారు చేయునపుడు ఈ సత్యనిష్ఠను మఱువకుండ జాగ్రత్తగ చూడవలయును.

## ప్రశ్నలు

1. ప్రాథమిక విద్యా ప్రణాళిక యనగా నేమి? దీని నెప్పుడు సంస్కరించిరి?

2. ఈ సంస్కరణము వలన కలిగిన మార్పు లేవి ?
3. చరిత్రను బోధించుటకు గల యవకాశములను నిర్ణయింపుము ?
4. చరిత్రను విద్యావిషయముగను ప్రాముఖ్య మేమి కలదు ?

# 2. చరిత్రను బోధించుటలో ముఖ్యోద్దేశములు

1. <u>వీరపూజకు మొదటి సోపానము</u> : చరిత్రలో ప్రసిద్ధిజెందిన మహాపురుషుల గుణగణములను, ఆశయము లను గ్రహింపజేసినచో బాలురకు వారియందును గౌరవభావ మేర్పడి, వారిని పూజింప నుత్సహింతురు. వారి నాయూసము యములలో ననుకరించుటకు ప్రయత్నింతురు. మహావీరుల పూజ జాతీయోన్నతికి అనేకవిధముల తోడ్పడగలదు.

2. మన పూర్వులయందును, నాటియాచారములు, వస్తువులు, సంస్థలు మొదలగువానియందును మనకభిమానము నాసక్తిని కలిగించును. హంపీక్షేత్రమునందలి శిథిలములను చూడగనే పూర్వకాలమున నుండిన విజయనగరసామ్రాజ్య వైభవము స్ఫురించును. మహాయుద్ధములు జరిగినస్థలములను దర్శించినచో పూర్వుల సాహసపరాక్రమములు జ్ఞప్తికి వచ్చును. మనము గమనించు వస్తువులన్నియు పూర్వపు మన యౌన్నత్యమును సంపూర్ణముగ గ్రహించునట్లు చేయును. దీనివలన బాలురకు ప్రాచీనవిషయములం దాదరము కలిగించును.

౩. నేటి కాలమునకును, పూర్వకాలమునకును గల సన్నిహిత సంబంధమును తెలియజేయును. నేటి పరిపాలనా విధానమున మనకు పరిచయమైయున్న మంత్రులు, శాసన పరిపాలక సభలును కాలక్రమానుసార మార్పులను జెందుచు వచ్చిన పూర్వపు హిందూరాజుల మంత్రాలోచన సభ లేయని విద్యార్థులు గ్రహించవలెను. పూర్వకాలపు సంస్థలయు నాచారములయు చరిత్రను గ్రహించుచు వచ్చినయెడల కాలక్రమమున వానికి గలుగు మార్పులను సులభముగ గ్రహింపగలము.

౪. చరిత్రను చదివించుటవలన బాలబాలికలలో కార్యోత్సాహము వృద్ధినొందును. అందువలన రాజ్యము జాతి వికాసవంతమై కీర్తిని ప్రతిష్ఠను సంపాదించుకొనును నైతికమగు భావనాబలము (moral thoughtfulness) వృద్ధి పొందును.

5. గొప్పవిషయములను కొలదివిషయములను చరిత్రలో ప్రాముఖ్యమునుబట్టి బాలబాలికలు గ్రహించునట్లు చేయవచ్చును. ఏకాలపువారికి ఆకాలమందలి గొప్పవిషయములు అంత గొప్పగ స్ఫురింపక పోవచ్చును. శివాజీజన్మకాలమున ప్రజాదృష్టి నాకర్షించి యుండదు. కాని చరిత్ర చదివిన యిటీవలివారికి ప్రాముఖ్యము స్పష్టముగ తోచుచున్నది.

6. దేశచరిత్రయే నాగరికతచరిత్రయునగుటచే, రెండిటికిగల పరస్పరసంబంధమును బాలురచే గ్రహింపజేయ

వచ్చును. మన పూర్వులకు దెలియని రైలు, మోటారు, వాయువిమాన సౌకర్యములు మనకు ప్రతిరోజును గలుగు అనుభవములో నున్నవి. అందుచే నాగరికములను పూర్వపు రోజులలోనుండుటకు విద్యార్థు లిచ్చగింపరు. కాలముననుగల పరివర్తనమును గుర్తించుటకిది మంచి నిదర్శనము.

చరిత్రను బోధించుటలో గల ముఖ్యోద్దేశములు పైన వివరింపబడినవి. ఒక్కొక్క విషయమును బోధించుటకు తగు భాగమును పరికరముల నుపాధ్యాయులు గూడ చరిత్రనుండి సంగ్రహించి యుపయోగించవలెను.

### ప్రశ్నలు

1. చరిత్రను బోధించుటకు గల ముఖ్యోద్దేశము లేవి?
2. దేశీయచరిత్ర యనగా నేమి? నాగరికతకును దీనికిని గల సంబంధమును తెలుపుము.

---

## 3. బోధింపదగిన యంశములు
## (Topics of History)

### జాతీయ చరిత్ర

మొదటిమనుష్యులు వింతపశువులవంటివారు. చిత్రములలో వారిని బాలురు చూడగలిగినచో మిక్కిలి యానందింతురు. తమవలెనే మానవులై పుట్టినను, తమకును వారికిని గలుగు వ్యత్యాసములు సులభముగ వారిదృష్టి నాకర్షించును. ఘాతుక మృగముల వలె భయముగొలుపు రూపములును,

పలువ విదేశముల నాగరికతయు నాచార వ్యవహారములు [illegible] గ్రహింపబడి బౌద్ధనాగరికతలో మేళవింపబడినవి. [illegible] హైందవరాజుల కాలమునాటి నాగరికత [illegible]. ఆస్తిక మతసాంప్రదాయములన్నియు ప్రజల జీవితమును దిద్ది ప్రతిష్ఠింపబడినవి. పరిపాలనావిధానమును, ఆర్థిక సాంఘిక నియమములను మొదటికాలమునందే సంగ్రహింపబడి సంస్కరింపబడినవి. రాజనీతి యపారముగా వికసించినది. ఈ విధముగ పూర్వకాలపు నాగరికత లోకదాని వెలుక నొకటి యుదయించి మన దేశమున వృద్ధిబొందినది.

జాతీయ చరిత్ర:— భారతదేశముచరిత్రయే మనకు ప్రధానమైనది. భారతీయులకు భరతమాతయే పరమదైవమనియు, దేశగౌరవమును వైభవమును వృద్ధిచేయుటకు ప్రతి భారతీయుడును ప్రయత్నించవలయుననియు, మాతృదేశారాధనము జీవితమున పరమధర్మమనియు ప్రతివిద్యార్థియు గ్రహించవలయును. ఈ క్రింది విషయములు స్పష్టముగ బోధించవలెను.

1. భారతదేశము — నైసర్గికలక్షణములు — ఫలభరితమైనది — శీతోష్ణస్థితియు — జలసమృద్ధియు — వ్యవసాయము ముఖ్యవృత్తి — నాలుగువర్ణములు — వానిధర్మములు — సుఖజీవనము.

2. మహమ్మదీయులరాక — వారి యాశయములు — జేతమున సంక్షోభభావము లేకుండుట — మహమ్మదీయ ప్రభుత్వము — పరిపాలనా విశేషములు — రాజ్యపరిపాలనము — ప్రజలస్థితి.

3. దేశీయభావోద్రేకము - మహారాష్ట్రులు - శివాజీ, హిందూధర్మములు ప్రతిష్ఠింపబడుట - మహారాష్ట్రులవిజయ పరంపర.

4. ఐరోపియనులు : మన దేశమునకు నూతన మార్గములను కనిపెట్టుట - వర్తక పరిస్థితులు - వాస్కో డిగామా - నీటిమార్గము - ఐరోపియను కంపెనీలకు వర్తకములకుపక్రమణాలు - వర్తకాభివృద్ధి - మహమ్మదీయ ప్రభుత్వముల బలహీనస్థితి - ఐరోపియనులు సైన్యములను నిలకొల్పి రాష్ట్రములను ఏర్పరచుకొనుట - పరస్పర కలహములు - ఇంగ్లీషువిజయములు - 1858 లో పరిపాలన కంపెనీనుండి ప్రభుత్వమునకు మారుట - శాంతి - సౌఖ్యము - స్వేచ్ఛాజీవనము.

## జాతీయ చరిత్ర ప్రాముఖ్యము

1. విద్యార్థులను జాతీయభావము కలిగించి యుత్సాహవంతులను జేయును. విదేశముల చరిత్రలను చదివినపుడు తన దేశగౌరవమును, జాతిగౌరవమును నిలుపుకొను మార్గములను ప్రతి విద్యార్థియు తెలిసికొనగలడు.

2. జాతీయ చరిత్రకారులగు మహాపురుషులు ఆకాశమున దివ్యజ్యోతులవలె మెఱయుచు విద్యార్థులకు మార్గదర్శకులై యున్నతాశయములను బురికొల్పుదురు.

3. నేడు మన కత్యంత ప్రీతికరములగు సమస్యల పూర్వచరిత్రను తెలుసుకొనుటకు మంచి యవకాశము కలుగును. అందుచే నివి యాకస్మిక విషయములు గావనియు,

కాలక్రమమున నిరూపణమును దాల్చననియు తెలుసుకొన వచ్చును. హరిజనసమస్య పూర్వ మంత తీవ్రముగ నుండ లేదు. నేడిట్లుండుటకు హేతువులను నిరూపించవచ్చును.

4. చరిత్రనుబట్టి మన సాంప్రదాయముల కనుగుణ ముగ నేయేవిధములుగ మనజాతి వృద్ధిపొందగలుగునో, ప్రపంచ చరిత్రలోను, అంతర్జాతీయ రాజకీయ స్థితియందును మన మెట్టి స్థానమును పొందగలమో గ్రహించవచ్చును. దానికనువగు మార్గముల నన్వేషింపవచ్చును.

## ప్రశ్నలు

1. జాతీయచరిత్ర యనగా నేమి?
2. ఆదిమనివాసు లెవరు? వారినిగురించి మనమేల చదువవలయును?
3. జాతీయచరిత్రయందు మనదేశమున బోధించదగిన యంశములెవ్వి?
4. ప్రాథమిక పాఠశాలలలో జాతీయచరిత్రకు గల ప్రాముఖ్యమేమి?

---

# 4. బోధింపదగిన యంశములు

## స్థానిక చరిత్ర

### స్థానిక చరిత్ర అనగా నేమి?

1. దేశ చరిత్రలోని కొన్ని ముఖ్యవిషయము లా యా స్థలములలో జరిగియుండును—బొబ్బిలియుద్ధము, పల్నాటి వీరులు, హంపీ క్షేత్రము.

2. చరిత్రకారులగు మహాపురుషు లాయాప్రదేశములనివసించియుండుట — రాజరాజనరేంద్రుడు, రాజా రాము మోహనరాయలు, యుగంధరమంత్రి.

3. దేశ చరిత్రయందు ప్రాముఖ్యము వహించిన సంస్థలు ఉద్యమములు, సంస్కరణములు నా యా స్థలములలో జరిగియుండుట.

పైవిషయములకు ప్రసిద్ధిజెందిన స్థలములలో స్థానిక చరిత్ర బోధించునపు డీవిషయములు ప్రధానములుగ పరిగణింపవచ్చును.

ఉపయోగములు: —

చరిత్రను స్వయముగ తెలుసుకొనుటకును, దానియందుత్సాహము కలిగించుటకును స్థానిక చరిత్రను బోధించవలయును. (1) దేశచరిత్రను కొంతవరకు నిర్ణయింపగలిగిన విషయములను గూర్చియు, మహాపురుషులను గూర్చియు తెలియుటచే విద్యార్థుల కాసక్తియధికమగును. (2) తాము నివసించు స్థలములింత ప్రాముఖ్యము గలవని తెలియుటచే జాతీయ గౌరవమునందు విద్యార్థులకు దృష్టి నిలుచును. (3) వివిధ విషయములను స్వయముగా చూచి, నిజానిజములను విమర్శించుకొని, విద్యార్థులు స్థానికచరిత్రను వ్రాయు నభ్యాసము నొందుదురు. చరిత్రకారులు తమకార్యనిర్వాహణమున నెంత ప్రయాసకు పాల్పడుదురో వారు సులభముగ గ్రహింపగలుగుదురు. (4) ఏనాడో ఎచ్చటనో జరిగిన విషయములను తెలిసికొనుట చిన్నవారికి విసుగుకలిగించును.

అప్పటి స్థలములను, పరిసరములను నేటికిని గలవని వానిని గ్రహించి, పూర్వుల నివసించుచుండిన తీరును గుర్తింపు చేయ గలుగుదురు.

చరిత్రను చదువుటకిది నిర్దుష్టమగు సాధనము కాదు, ఏలన?

1. స్థానిక మహాపురుషులను గూర్చి విద్యార్థి చదువునపుడు వారినిమించినవారు ప్రపంచమున లేరని యూహించును. లోకైకవీరుడనిగాని, లోకాదర్శవ్యక్తియనిగాని, లోకైకరాజనీతిజ్ఞుడనిగాని యూహించును. దేశచరిత్రను చదువునపుడు వీరినిమించు వీరులును, వ్యక్తులును, రాజనీతిజ్ఞులును గలరని గ్రహించుట సులభము కాకపోవును. చరిత్రలో వారి కెంత ప్రాముఖ్యమున్నదో గుర్తింపజాలకుండును.

2. స్థానికవిషయములందభిమానము మెండగును. కొంచని విశాలమగు దృష్టియు, జ్ఞానమును చిన్నబాలురలో కలుగుటకు వీలుపడదు. సమీపముగనున్న విషయములను మాత్రము గ్రహింపగలుగుదురు.

3. తమ వీరులే గొప్పవారనియు, తమ సంస్థలే గొప్పవనియు తలచుటచే వివిధస్థానిక సంఘముల కైకమత్యమునకు మారుగ పరస్పర సంఘర్షణమునకవకాశమేర్పడును. దేశీయ వికాసము మరుగుపడును.

4. స్థానిక చరిత్రను తయారుచేయుటని చారిత్రకునికి కడపటి పని. చరిత్ర నభ్యసించుటకు దీనితో ప్రారంభించిన మొదట సత్యాసత్యములను, సాధారణ విషయములను, ముఖ్యమైనవానిని గమనించుట కవకాశము గలుగదు.

సంఘటితయు స్థానికస్థలాభిమానము కలుగుటచే యుద్యార్థులకు చరిత్రజ్ఞానము కలుగుట దుస్తరమగును.

కావున ప్రాథమిక పాఠశాలలో స్థానిక చరిత్రపాఠము లను కొంతవరకు నేర్పుట యవసరము. మిక్కిలి యధికముగ ప్రయత్నించినయెడల నిజముగ చరిత్రజ్ఞానము కలుగుట కష్టము. ఉపాధ్యాయులు వీని ననుసరించి పాఠములను నిర్ణయించవచ్చును.

ప్రశ్నలు

1. స్థానిక చరిత్ర యనగా నేమి?
2. దీనికిని జాతీయచరిత్రకును భేదమేమి?
3. మనము పాఠశాలలలో స్థానికచరిత్రను నేల బోధింపవలయును?
4. క్రమమయిన చరిత్రపఠనమునకిది యెంతవరకు తోడ్పడును?
5. దీని నాధారము చేసికొని చరిత్రను నెప్పుడు నెట్లు బోధింపవలెను?

## 5. బోధింపదగిన యంశములు:

### ప్రాథమిక పాఠశాలల ప్రణాళికను బట్టి యవసరములను నిర్ణయించి గమనించుట

ప్రాథమిక విద్యలో మూడవతరగతి నుండియు చరిత్ర బోధించుట కేర్పాటుచేసిరి. మొదటి రెండు తరగతులలోను సామాన్యములగు కథలలో నేర్పవచ్చును. శ్రీరాముడు, పంచపాండవులు, భారతయుద్ధము, బుద్ధుడు మొదలగు కథలు నేర్పుటచే వారియందు విద్యార్థులకు ప్రేమయు గౌరవమును కలుగును.

## మూడవ తరగతి

హిందూదేశ చరిత్రలో మొదటి రెండుయుగముల నుండియు గ్రహింపబడిన మహాపురుషుల కథలు నేర్పవలయును.

1. పురాణయుగము: — శ్రీరాముడు, పాండవులు, భారతయుద్ధము, హరిశ్చంద్రుడు, శిబి మొదలగు కథలు. వీనియందలి నీతిని బాలుడు గ్రహింపవలయును. ఉత్తమపురుష లక్షణములు, సత్యము, త్యాగము, సత్ప్రవర్తనము, శత్రుసంహారము మొదలగువానిని గమనింపజేయవలయును.

2 బౌద్ధయుగము: — బుద్ధుడు, అశోకుడు — వీరికథలు, బుద్ధుని జీవితరహస్యము ప్రోత్సాహితమగు సంవరము బౌద్ధమత వ్యాప్తికి అశోకుని ప్రయత్నము గుర్తింపజేయవలయును.

3. హిందూరాజ్యవైభవము: — (1) రాణీసంయుక్త ఆమె స్వయంవర వృత్తాంతము, జయచంద్రుని ప్రాపస్వార్థబుద్ధి, దేశమునకు ద్రోహముకలుగుట. (2) పద్మిని, చిత్తూరురాణి, తురుష్కుల యార్భాటము, మానసంరక్షణ ప్రయత్నములు, వీరధర్మము గ్రహింపజేయునది.

4. మొగలుయుగము: — (1) బాబరు: యుగకర్త, అతని జీవితరహస్యములు, ఉత్కృష్టభావములు, కుమారుని యస్వస్థత, అతని నియమము, కార్యసిద్ధి. (2) నూర్జహాన్: జీవితము, ఆమె ప్రామాణ్యమునొందుట, చక్రవర్తినిగ్రహము, పరిపాలనావిశేషము.

సి. స్థానిక చరిత్ర:— కళింగ ప్రాంతము - రంగారాయుడు, బొబ్బిలి యుద్ధము, వెలమవీరుల ప్రతాపాగ్ని. స్త్రీల సాహస కార్యము.

వేగినాడు - రాజరాజనరేంద్రుడు, నన్నయభట్టు, సారంగధరుడు కల్పితవ్యక్తి, సారంగధర మెట్టు.

పలనాడు-(1) నలగామరాజు, (2) బ్రహ్మనాయుడు, అచ్చటి ప్రతాపాతిశయము.

## నాలుగవ తరగతి

ఈ తరగతిలో గూడ చరిత్రాంశములు కథలుగ నేర్పుటయే ముఖ్యము. వీనిలో రాజులు పాత్రలుగా కనబడి, మన దేశపు చరిత్రము నాకర్షకముగా నెట్లు చేసిరో నిరూపించవలయును. విద్యార్థుల కాసక్తియు ఆనందమును మాత్రమే కలిగించుట కుపాధ్యాయుడు ప్రయత్నించినచో చాలదు. కథల ద్వారా 'చరిత్ర జ్ఞానము' కలిగించవలెను. మరియు ఈ తరగతులలో కాలనిర్ణయము కూడ బాలురకు తెలిసియుండవలయును. క్రీస్తుశకము, శాలివాహనశకము, విక్రమార్కశకము అనగా నేమియో గుర్తింపజేయవలెను.

1. క్రీస్తుపూర్వయుగము:— (1) మగధరాజ్యము (2) పురుషోత్తముడు - అలెగ్జాండరు (3) అశోకచక్రవర్తి మహామహుడగుటకు కారణము - ఈ కాలమున సంవత్సరములను లెక్కించుట - బి. సి., ఎ. డి., అను పదముల వివరణము.

దక్షిణదేశ చరిత్రలో పేరొందినవానిని గూర్చి [illegible] బోధింపవచ్చును.

7. మొగలు సామ్రాజ్య చరిత్రను సంగ్రహముగా వివరింపుము.

8. వర్తకమార్గములేల కనిపెట్టబడెను? ఆంగ్లేయుల రాజ్యస్థాపనమున కివి యెట్లు సాయపడెను?

9. బ్రిటీషు పరిపాలనవలన గలుగు లాభములేవి?

# ౪. ప్రాథమికదశలో బోధించు పద్ధతులు

## కథా పద్ధతి

పూర్వకాలమున చరిత్రను బోధించు పద్ధతులు రెండు మాత్రమే. పాఠపుస్తకము నుపయోగించునది మొదటిది. ఉపాధ్యాయుడు పాఠవిషయములను సంపూర్ణముగ సంగ్రహించుకొని పుస్తకముపై నాధారపడకుండ, స్వతంత్రముగ విషయములను మనోరంజకముగ తెలియజేయునది రెండవది. మొదటి పద్ధతికంటె రెండవది యోగ్యతరమయినది. కాని చరిత్రపాఠఫలితముగ విద్యార్థులు కొన్ని విషయములనువిధిగా గ్రహించవలసి యున్నది. కేవలము ఆసక్తి గొలిపినంత మాత్రమున ప్రయోజనము కలుగదు. వాగ్రూపముగ బోధించిన పాఠము, జరిగినంతవఱకు నానందకరముగ నుండును కాని పాఠము ముగియగానే విద్యార్థుల జ్ఞానము సంశయాస్పదమగును. దృఢపడనేరదు, పుస్తకము నుపయోగించుట యెక్కువగా కార్యకారియగును. వారిజ్ఞానము దృఢపడును. కాని దీనియం దతిప్రాముఖ్యము నిచ్చుటచే

విద్యార్థుల కాసక్తి తరిగిపోవును. ఉత్సాహముతో గ్రహించు జూడరు. నేటికాలమున నీరెండు పద్ధతులును సంస్కరింపబడి యితర విధానములతో నుపయోగింపబడుచున్నవి. యితరములగు సాధనములును, అనుకూలపడు పద్ధతులను మనమిక్రింద నిర్ణయించుకొందము.

కథలనిన చిన్నవారికి చాలయిష్టము. అతి చిన్నపాపలకు సంతోషమును గలిగించుటకు ముసలివారగు అవ్వలును తాతలును చక్కని కథలను తెలుపుచుందురు. కథలను వినునంతకాలమును చిన్నవారు తమ్మును తాము మఱచి కథాగమనమున లీనమగుచుందురు, ఈ యుపయోగమును గమనించి చరిత్రోపాధ్యాయుడు చక్కని కథలను తెలుపుచు చరిత్రబీజములను నాటుటకు ప్రయత్నించవలయును. చరిత్రను బోధించు పద్ధతులలో నిది మొదటిది. చాలసులభమయినది. మంచి ఫలప్రదమయినది. కథాపద్ధతి జయప్రదముగ నుండుటకు క్రిందిలక్షణములు విధిగ నుండవలయును.

### I. కథలను నిర్ణయించుట — వానిని గుచ్ఛములుగ నేర్పఱచుట: —

(a) బాలుర యాసక్తిని సంగ్రహించుకొనుటకు కథలలోని యంశములు ఆశ్చర్యమునుగాని, ఉత్సాహమునుగాని గొలుపవలయును. నిర్జీవములగు కథలను నిర్ణయింపరాదు. వీరాగ్రేసరుల ప్రతాపాగ్నినిగూర్చి తెలుపవలయునని సావిత్రులయు, వెలమవీరులయు కథలను నిర్ణయించుట మంచిది. చిత్తూరు ముట్టడి, బొబ్బిలియుద్ధము మొదలగు

హానిని, కళనాటికవీరులు, మహారాష్ట్రవీరులు, సిక్కులు మొదలగువారి కథలను గుచ్ఛములుగ చేర్పవచ్చును. వీని నడుమను పిచ్చితుగ్లకునుచరిత్రను కథగా వివరించిన యెడల మంచి పాటిల్లును.

(b) వ్యక్తులనుగూర్చిగాని, సంస్థలనుగూర్చిగాని చెప్పునపుడు కథకుడు ముఖ్యాంశములను మాత్రము వివరించవలయును. అనావశ్యకములగు వివరములను విడిచిపెట్టుట యుత్తమము. బొబ్బిలియుద్ధమును కథగా చెప్పునపుడు కోడిపందెములు, కోటలోని పెండ్లి వివరములు విడిచిపెట్టవచ్చును.

(c) మహాపురుషులజీవిత చరిత్రలను కథలుగా తెలుపునపుడు, వారియందలి గుణాతిశయము గ్రహించుట కనువుగా నుండవలయును. గుణపాఠము లేని కథలు నిరర్థకములు. మఱియు కాలహరణములు.

2. కథాకథనము:—

1. కథకునికి చెప్పుటయందు మంచినేర్పు అవసరము. నేర్పు చాలనిచో కథ విసుగు పుట్టించును. అందువలన బాలుర శ్రద్ధాసక్తి క్షీణించును. మఱియు వారిదృష్టి కథయందు నిలువక యిటునటు ప్రసరించును. కావున చెప్పుటలో నేర్పు నుండుట చాల యవసరము.

2. కథకుడు తానే చెప్పుచు వచ్చినపుడు విద్యార్థుల శ్రద్ధాసక్తి నిలిచినను, వారిదృష్టి యుపాధ్యాయునియందు నిలిచినను, పూర్వాపరదశలలో వివరములను మఱచిపోవుట తటస్థించును. కథయంతయు వినినపిమ్మట తిరిగి చెప్పుట చాల

సమయములలో దుస్తరమగును. అందుచే కథయందలి యొక్కొక్క దశయందును బాలురజ్ఞానమును తెలిసికొను టకు ప్రశ్నలు వేయుట తరచుగా నవసరమగుచుండును. ప్రశ్నలకు సమాధానములు చెప్పునపుడు విద్యార్థులు ఎక్కువ జాగ్రత్తతో వినుచుందురు.

3. కథను కొన్ని భాగములుగ నూహించి యొక్కొక్క భాగమును వివరించినవెనుక వారిలో నొక్కొక్కరిచే చెప్పించుట వలన మంచి యుపయోగము కలదు. ఎంతవఱకు గ్రహించి బాలురు తిరిగి చెప్పగలరో ముందుగా నుపాధ్యాయుడు గమనించవలయును. లేనిచో వారు తిరిగి చెప్పుట సమర్థముగ జరుగనేరదు

4. కేవలముగ నాసక్తి గొలుపుటయే యుపాధ్యా యుని కర్తవ్యమని యూహించి తమకథలను మొదటినుండి చివరవఱకు నాకర్షకముగా చేయుటకు వారు ప్రయత్నింతురు. అందుచే విద్యార్థుల యాసక్తి యనుమడించుటకు మారుగ క్షీణించును. నిశ్శబ్దముగ నున్నపుడు చప్పట్లు చరచినచో మన దృష్టి యావైపు మరలును. కానిసంతతము ధ్వనికలచోటులలో చప్పట్లు చరచుట దృష్టి నాకర్షింపజాలదు. అందుచే కథలో కొన్నివిషయములను మాత్రి మాకర్షకములుగ చేసి మిగిలినవి సాధారణములుగ నుండునట్లు చూచుట యవసరము.

5. కథావిషయము లుపాధ్యాయుడు బాగుగ నెఱిగి యుండవలయును. ఎఱిగినవానిని క్రమముతప్పక యేర్పఱచు కొని సమయానుకూలముగ ప్రిదర్శించవలయును. వానిని

ప్రదర్శించుటలో చక్కని శైలియు, స్వరమును, అనవసరములగు విషయములు చక్కగ తెలిసినను వర్ణించి చెప్పు సామర్థ్యము లేని యుపాధ్యాయుడు మంచి కథకుడు కానేరడు.

6. ఉపాధ్యాయుని భాష బాలుడు సులభముగ గ్రహించునట్లుండవలయును. యుద్ధమును, రాజభక్తిని, దేశభక్తిని వెల్లడించు కథలు చెప్పునప్పుడు బాలుర కన్నులకు కట్టునట్లును, మనసునకు గోచరమగునట్లును వర్ణించవలయును. అందుకు తగిన యుత్సాహము, తీవ్రభావము, చాకచక్యమును ఉపాధ్యాయునిలో కనబడవలయును. లేనిచో కథలు నిర్జీవము లగును.

7. కథకునకు ప్రశ్నలు చాలవఱకు తోడ్పడగలవు. కేవలము పసివారికి చరిత్ర బోధించునపుడు వీనికి తగిన యవకాశము లేదని త్రోసివేయవచ్చును. ఏలయనగా, మనకు సమాధానములు తెలుపదగు చరిత్రాంశములు వారి పూర్వజ్ఞానమున నుండుట యసంభవము. కాని యిది సరికాదు. ప్రశ్నలు కథాప్రారంభమున నుపయోగించును. ఇప్పటి కథాంశములను బోలినవానిని వా రెఱిగియుందురు గావున నుపాధ్యాయుడు ప్రశ్నలమూలమున వానిని రాబట్టవచ్చును. ఇట్టి ప్రశ్నలవలన బాలురదృష్టి క్రమముగ నిలుచును. ఆసక్తి యినుమడించును. భావములను పురికొల్పి యాలోచనను వృద్ధిచేయును. పాఠము మధ్యభాగమునకూడ ప్రశ్నలు చాలవఱ కుపయోగించును. ఒక్కొక్క సందర్భమున నేమి చేయుట యుక్తమని బాలురూహింతురో, నిజముగ నేమి జరిగెనో గ్రహింపజేయుటకు ప్రశ్నలడుగవచ్చును. తాను

తెలిపిన విషయములను వారెంతవఱకు గ్రహించిరో తెలుసు కొనుటకు ప్రశ్నలే మంచియాధారము. తరగతి బాలుర శ్రద్ధతో నెంతవఱకు వినుచున్నారో, ఎట్లు వెనుకబడి యుండిరో గమనించుటకు కివి తోడ్పడును. పాఠము జరుగు నపు డుపాధ్యాయుడు బాలురకు దురూహములగు విషయ ములనే తెలుపవలయును. కాని వారు తెలుపగలిగిన వానిని తానే తెలుపుట మంచిపద్ధతి కాదు. ఇట్లు వారిచే చెప్పించు టకు ప్రశ్న లెక్కువగ తోడ్పడును. పాఠము ముగియగనే బాలుర జ్ఞానము దృఢపఱచుటకును వారెంతవఱకు గ్రహిం చిరో తెలిసికొనుటకును ప్రశ్నలుపయోగపడును. పాఠము నందలి పరీక్షభాగమును ప్రశ్నోత్తర రూపముగ నడపుటయే శిష్టాచారమైనది. కావున ప్రతి యుపాధ్యాయుడు నీ నియమ మును పాటించవలయును.

8. కథలను చెప్పునపుడు విషయములను సత్యము లుగచూచి గ్రహించవలయును. సత్యములగువాని నానక్తి సి గొలుపుటకై తారుమారు చేయరాదు. హృదయాకర్షకము లగు విషయము లసత్యములైనచో విడిచిపుచ్చవలయును. చరిత్రకు సత్యతత్వము హృదయము. అందుకొఱకు బోధించు కథలు కేవలముగ నాకర్షకములైనను సత్యవిషయ ములు వానియందు లేనిచో బాలురకు నిజమగు చరిత్రజ్ఞాన మలవడనేరదు.

కథలను బోధించు నుపాధ్యాయుడు పైనదెలిపిన విష యములను శ్రద్ధతో గమనించవలయును. లేనిచో నతడు చక్కని కథకుడు కానేరడు.

## ప్రశ్నలు

1. కథాపద్ధతియేది? అది చరిత్ర బోధించుటలో ఎట్లు తోడ్పడును?
2. కథలను గుచ్ఛములుగా గూర్చవచ్చునా? అందువలన లాభము లేమి?
3. కథాకథనమున గమనింపదగిన ముఖ్యసూత్రము లేవి?
4. ప్రశ్నలు కథకుని కెంతవరకు తోడ్పడును?
5. కథల నాకర్షకముగ నుంచుట కేమి యుపాయములు గలవు?

# 7. ప్రాథమికదశలో బోధించు పద్ధతులు :

## కాలానుక్రమణము (Chronology)

### కాలానుక్రమణము : దాని ప్రాముఖ్యము

చరిత్రకు కాలవాహిని నేత్రమువంటిది. అందుచే చారిత్రకునకుగూడ దీనియుపయోగ మపారము. చరిత్రకర్తలగు మహాపురుషులును, మహాయుద్ధములును, మహారాజ్యములు నాయా కాలములలో నుండినవి. ఒకటివెనుక నొకటి గావచ్చు వీనినిగూర్చిన పూర్వాపరజ్ఞాన మత్యవసరము. పురాణయుగమునందలి వీరుల తరువాత కొన్నిశతాబ్దములకు అశోకుడు, విక్రమాదిత్యుడు, హర్షుడు మొదలగు చక్రవర్తులును, పద్మిని, మల్లమదేవి, రాణీసంయుక్త మొదలగు వీరకాంతలును అవతరించిరి. పురాణకాలము తరువాత బౌద్ధమతము వచ్చినది. తరువాత కొంతకాలమునకు మనదేశమున తురుష్కమతమును, క్రైస్తవమతమును వెలసినవి. వైదికమతమునందలి కొన్నిలోపములను సవరించుటకు బౌద్ధ

మత మేర్పడినది. కావున నామతము వైదికమతమునకు తరువాతి కాలమునకే యుండవలయును. ఈ విధముగ సంస్థలయొక్కయు, మతములయొక్కయు, చారిత్రకవస్తువులయొక్కయు కాలనిర్ణయము చేసికొనుట చరిత్రకారుల మొదటిపని. లేనిచో నాయా సంస్థలయు, వీరులయు స్థానమును చరిత్రలో నిర్ణయించి ప్రాముఖ్యమును గుర్తించుట యసాధ్యమగును.

ఒకకుటుంబచరిత్రను తెలుసుకొనునపుడు గూడ కాలజ్ఞానము ముఖ్యము. మొగలుచక్రవర్తులలో బేబరు మొదటివాడు. సామ్రాజ్యము నతడు స్థాపించెను. అక్బరు దృఢస్థితిని కలిగించెను. ఔరంగజేబుకాలమున క్షీణదశ ప్రారంభమాయెను. బేబరు క్రీ. శ. 1526 సంవత్సరములోను అక్బరు క్రీ. శ. 1556 లోను రాజ్యాధికారము నొందిరని తెలియకున్నచో నీయుచ్ఛక్షీణదశలను గమనించుటకు వీలు కలుగదు.

మతచరిత్రలోగూడ నిదియే స్పష్టమగును. శంకరమతము మొదటిది. ఎనిమిదవ శతాబ్దమునాటిది. రామానుజ మతము పదునొకండవ శతాబ్దమునాటిది. మొదటనే రామానుజమతమును గ్రహించినచో విద్యార్థులకు మతచరిత్రల సమన్వయము తేటపడనేరదు.

**విద్యార్థుల కాలజ్ఞానము:** ఇదిచాల యల్పమయినది. దూర మెంతయున్నదో గమనింపజేయుట యెంతకష్టమైనదో, కాలమెంత గడచినదని బాలురు గ్రహించుటయు నంతకష్టముగు పరిశ్రమయే. ఉపాధ్యాయుడు బాలుర యనుభవములోనున్న విషయముల నాధారము చేసుకొని భూత,

వర్తమాన, భవిష్యత్కాలములు వివరణము చేయవచ్చును. చక్రవర్తిగారి పట్టాభిషేకమును, ఘోరమగు యూరోపియను సంగ్రామము ప్రారంభమగుటయు కడచిన విషయములు. ఇవి తిరిగి మన యనుభవమునకు రావని బాలురు గ్రహించవలెను. జరుగుచున్నది వర్తమానకాలము. ప్రపంచమునందు రానగిన మార్పులు, సంస్కరణములు, నాగరికత, రాజ్యము లేర్పడుటయు, కాలగర్భమున నిమిడియున్నవి. ఆయా కాలములలో వచ్చును. బాలుర జీవితమున భూత, వర్తమాన, భవిష్యత్కాలము లున్నట్లే మహాపురుషుల జీవితములయందును, దేశచరిత్రలయందును, నాగరికత చరిత్రలయందును గలవని బాలురు గ్రహించవలయును. గతకాలము నాటిలో తమకు సహవాస భాగ్యము కలుగదని బాలురు తెలుసుకొనవలయును. ఈదశలో ఇంతమాత్రము వారు గ్రహింపగలిగినచో చాలును. శతాబ్దములు, యుగములు, శకములు మున్నగునవి కాలవాహినియందలి దురవగాహ విషయములు. చరిత్రను చదువుచున్నకొలది వానిని గ్రహించుట కవకాశము లేర్పడును. అప్పుడు వారాయా విషయములను తెలుసుకొన ప్రయత్నింతురు. అంతవరకు వీనిని నిలిపియుంచుట మంచిది. ఉపాధ్యాయుడు వీనిని వివరించుటకు ప్రయత్నించినచో బాలుర కాలజ్ఞానము దృఢపడుటకు మారుగ సంశయాస్పదమును యంధకారమగును.

నేర్పదగిన తేదీలు : వానిని నేర్పు విధానము

మన దేశచరిత్ర సుమారు 400 సంవత్సరముల

ప్రాయముగలది. క్రీ. పూర్వము రెండువేలసంవత్సరముల నుండియు ప్రారంభమయి, క్రీ. శకమున నిరువదియవ శతాబ్దము గడచుచున్నది. మన దేశ చరిత్రలో ప్రతిసంవత్సరమునను కొన్ని ముఖ్యవిషయములు జరిగినవి. మహావీరుల జీవితములును యుద్ధములు, మత ప్రారంభము మొదలగు వానితో జరిగినవి. ఈ సంవత్సరములను వాని వివరములను తెలుపుటకు ప్రయత్నించినచో చరిత్రయందభిరుచి పుట్టక విద్యార్థులు విసుగుజెందుదురు. వీని నన్నింటిని కంఠపాఠము చేయించుట కలవికాదు. కావున ముఖ్యముగ జ్ఞప్తియుంచుకొనదగినవానినిమాత్రము ప్రత్యేకించి నేర్పవలయును. ఈ క్రిందివానిని గమనింపజేయుట మంచిది :

క్రీ. పూ. 2000 — వేదయుగము ప్రారంభము
,, 326 — అలెగ్జాండరు దండయాత్ర
,, 321 — చంద్రగుప్తమౌర్యుని పరిపాలనము ప్రారంభము
క్రీ. శ. 320 — గుప్తవంశము ప్రారంభము
,, 1000 — మహమ్మదీయుల దండయాత్రలు
,, 1565 — తల్లికోటయుద్ధము
,, 1526 — పానిపట్టు మొదటియుద్ధము — మొగలు రాజ్యప్రారంభము
,, 1526 – 1707 మొగలు సామ్రాజ్యము
,, 1600 — ఇంగ్లీషు వర్తకకంపెనీ యేర్పడుట
,, 1674 — ఛత్రపతి శివాజీ పట్టాభిషేకము

క్రీ. శ. 1757 — ప్లాసీయుద్ధము, ఆంగ్లేయ రాజ్య స్థాపనము

,, 1858 — విక్టోరియారాణి ప్రకటన—హిందూ దేశము బ్రిటిషు ప్రభుత్వము వారి యాధీనమునకు మారుట

## వీనిని నేర్చుకొనుటకు సాధనములు

తేదీలు నేర్చుకొనుట కష్టతరమైనది. విసుగు కలిగించును. ఒకదానితో నొకటి సంబంధపడి యుండకపోవుటచే కంఠపాఠముచేయుట సులభముకాదు. కాని వాని ప్రాముఖ్యమును చూచియుండుటచే వీనిని విడిచిపెట్టుట తగదు. ముఖ్యములగువానినైనను విద్యార్థులు గ్రహించునట్లు చేయవలెను. వెగటుగనుండు క్వినైనుమాత్రకు కొంత చక్కెరపూత పూసినను మాత్రను నమలునపుడు కష్టమగుట తప్పదు. వీనియందలి విసుగు పోవు సాధనములను ప్రయత్నించవచ్చును. కాని విద్యార్థులు శ్రమకోర్చియైన వీనిని గ్రహించవలయును. ఇట్టి చక్కెరపూత రెండుమూడు విధములుగ చేయవచ్చును.

1. తేదీలకార్డులు:— చిన్నచిన్న కార్డులను సంగ్రహించి, ఒకొక్కదానిపై నొక్కొక్క ముఖ్యమగు తేదీని అప్పుడు జరిగిన ముఖ్యవిషయమును గుర్తించవచ్చును. ఇట్టి అనేకములు తయారయి యుపయోగింపబడవలయును. పాఠము మధ్యగాగాని, ప్రశ్నలను వేయునపుడుగాని ఉపాధ్యాయుడు వీనిని బాలురకు కనబరచి గమనింపజేసినచో బాలుర జ్ఞానము దృఢపడును. మఱియు విసుగు పుట్టదు.

I, II తరగతులలో భాష నేర్పుటకు ఉపయోగించు (Flash Cards) కూడ ఈ సూత్రముమీదనే యాధారపడియున్నవి. పిల్లలుకూడ వీనిని తయారుచేసికొని తరచుగ నుపయోగించునట్లు చేయవలయును. ప్రాముఖ్యముగల తేదీలను నిర్ణయించుకొని, ఒక్కొక్క విషయమునకు సంబంధించినవాని నొక కార్డుమీద వ్రాసి, వివరములనుకూడ గుర్తించినచో విద్యార్థుల కాసక్తికరముగ తేదీలు బోధించుటకు నుపయోగించును. మొగలుసామ్రాజ్యమును గురించియు, విజయనగరసామ్రాజ్యమును గురించియు, మహారాష్ట్ర విజృంభణమును గూర్చియు నుపాధ్యాయులు తేదీల కార్డుల నీ విధముగ తయారుచేసి యుపయోగించవలెను.

2. చిత్రముల చార్టులు:— వీనిని తయారుచేయుట సులభము. పెద్ద కాగితమును నాలుగైదు భాగములుగ విభజించుకొని, కాలపరిమాణమును తెలుపునట్లు చిత్రములను గుర్తించవచ్చును. మొదటి పానిపట్టుయుద్ధమును బేబరు జయించుటను గూర్చి మొదటిచిత్రము — రెండవభాగమున బేబరు తన కుమారుడగు హుమాయూన్ ఆరోగ్యము కొరకు ప్రాణత్యాగము చేయుట — మూడవ భాగమున అక్బరు పరిపాలనమున హిందూ ముస్లిము సఖ్యతను నిరూపించవచ్చును — తరువాత తాజ్ మహల్ చిత్రమును — తరువాత ఔరంగజేబు కాలమున మహారాష్ట్ర విజృంభణమును చూపించవచ్చును. ఒక్కొక్క భాగమున సొగసగు చిత్రము, దానికి సంబంధించిన తేదీమాత్రము గుర్తించవలయును. వీని నుపయోగించు నుపాధ్యాయుడు వానివివరములను బాలు

రచే గమనింప జేయుగలరు. ఇట్లే ప్రతి యుద్ధమునకును, సంస్థకును, మహాపురుషుని జీవితమునకును చిత్రముల చార్టులు తయారుచేయుట సులభము; బాలురు తేదీల గమనించుటకు మంచిసాధనము.

3 కాలరేఖలు (Time lines):— తేదులు గమనింపజేయుటకు కాలరేఖలు చాల యుపయోగము గలవి. వీనివలన తేదులను జ్ఞాపకమున నుంచుకొనుటయేగాక, చరిత్రలో నేవిషయమున కెంత ప్రాముఖ్యము కాలనియమమున గలదో గమనించవచ్చును. మహారాష్ట్ర విజృంభణము ఎంత కాలము పట్టెనో దేశచరిత్రలో నెంత ప్రాముఖ్యము దీనికి గలదో సులభముగ తెలిసికొనవచ్చును.

నల్లబల్లమీద సుద్దకణికతో కాలరేఖ గీయవచ్చును. పైనుండి క్రిందివరకు గీతగీచి, దానిని సమానభాగములుగ చేయవలయును. ఒకేవిషయమునకు చెందినచో (చరిత్రయో, మహాయుద్ధమో, ఉద్యమమో) గీతకొక వైపున నా విషయమును వివరములు తేదులలో కుడిచేతివైపునను, రెండవ వైపున దేశచరిత్రలో నా కాలమున జరిగిన సాధారణ విషయములును గుర్తించవచ్చును. ఒక యుగమున (Period) కు వేసినట్లయితే పొడుగుపాటి డ్రాయింగు కాగితమున ప్రక్కపుటలో తెలిపినవిధముల గీతగీచి శతాబ్దముక్రింద సమాన భాగములుగ విభాగించవలెను. ఆ యుగమందలి ప్రత్యేక విషయము లొకవైపునను, సాధారణ చరిత్రాంశములు రెండవవైపునను గుర్తించవచ్చును. ప్రతి చరిత్ర పాఠమునను దీని నుపయోగించి యావసరమునుబట్టి వివరములు తుడిచివేసి

## ప్రశ్నలు

1. కాలానుక్రమణమనగా నేమి?
2. చరిత్రను గ్రహించుటకది యెట్లు తోడ్పడును?
3. బాలురకు కాలజ్ఞాన మెట్లు కలిగించవచ్చును?
4. నేర్పతగిన తేదీల నెట్లు నిర్ణయింతువు? వానిని నేర్పుటకు ముఖ్య సాధనము లేవి?
5. చిత్రపటముల చార్టులనగా నేమి? తేదీలు నేర్పుట కవి యెట్లు సాయపడును?
6. తేదీల కార్డుల నెట్లు తయారుచేయుదురు? ఎట్లు ఉపయోగింతువు?
7. కాలరేఖను తయారుచేయు టెట్లు?
8. మహారాష్ట్రీయుగమునకు కాలరేఖను తయారుచేయుము.

---

# 8. ప్రాథమికదశలో బోధించు పద్ధతులు

## బోధనకు సహాయకములు (Aids to exposition)

చరిత్రను బోధించునపుడు ఉపాధ్యాయుడు తనబోధన విద్యార్థుల దృష్టి నాకట్టునట్లు చూచుకొనవలయును. విషయముల క్రమమును నిర్ణయించుకొని యొకదానివెనుక నొకటి తెలుపుటకు ప్రయత్నించినయెడల పసిబాలురకు విసుగు పుట్టును. పాఠవిషయములందు వారు దృష్టి నిలుపజాలరు. కేవలము ఊహాప్రపంచమున విహరించుట వారికి దుస్తరముగ నుండును. కావున చరిత్రబోధనను జయప్రదముగ కొనసాగించుటకు క్రింది విషయములు సహాయపడగలవు.

ఉపాధ్యాయుడు వీనిని చక్కగ గమనించి యనుకూలముగా నుపయోగించుకొనుట మంచిది.

2 చిత్రములు, మాదిరులు (Models) పటములు:—

క్రింది తరగతుల విద్యార్థుల యుపయోగమునకు రంగుల చిత్రము లుండవలయును. మహాపురుషుల యొక్కయు దివ్య భవనముల యొక్కయు, యుద్ధముల యొక్కయు, చిత్రములు, పసివారికి కన్నులకు గట్టినట్టుండి యాసక్తిని పురికొలుపును. ఆయావ్యక్తులతో కలసి మెలసి యున్నట్లుతోచి వారిని గురించి తెలిసికొనుటకు ప్రయత్నింతురు. మఱియు వారియం దొక నూతన భావోద్రేకము కలుగును. తరగతి హెచ్చిన కొలది వీని యుపయోగము తగ్గుచుండును.

మాదిరులు (Models):— వస్తువులను సరి యగు మూర్తులు అలెగ్జాండరు, శివాజి, పృథ్వీరాజు, కృష్ణదేవ రాయలు మొదలగు మహాపురుషుల యాకృతులను చూడ గానే వారి గొప్పతనము బాలురకు స్ఫురించి వారి ననుకరించు నుత్సాహము కలుగును. సోమనాథదేవాలయము, తాజ్‌మహల్, హంపీలోని రాతిరథము— వీనిని చూడగానే యందలి చరిత్రాంశములు దృఢముగ నాటుకొనును. చరిత్రను బోధించు నుపాధ్యాయునికి వీని యుపయోగము అపారము. కాని యివి ప్రతి యుపాధ్యాయునికి నందుబాటులో నుండవు. అందుచే వీని నుపయోగించుట అందరికి సులభము కాదు.

దాసక్తి యధికమగును. మహాపురుషుల ప్రవర్తనలనుండి గుణపాఠములు నేర్చుకొని విద్యార్థులు తమ యనుభవములను సంస్కరించుకొనుటకు ప్రయత్నింతురు. వారి స్వభావమున సద్భుతమగు పరిణామ మేర్పడును.

శివాజి పసితనమున విద్యాభ్యాసము చేయుట, తల్లిని దైవముగ గౌరవించుట, భారతీయాభిమానమును పూనుట, స్త్రీజాతిని గౌరవించుట మొదలగు విషయములు విద్యార్థుల యనుభవములతో పోల్చవచ్చును. కొన్ని సాదృశ్యములను, కొన్ని భేదములను స్ఫురించును. భేదములెట్లు కలుగు చున్నవో వాని నెట్లు సరిచేసుకొని తాముకూడ శివాజీ ననుక రింపగలరో నిరూపించవలయును. క్లైవు పసితనమున అల్లరి చిల్లరగ తిరుగుట, తలిదండ్రులు విసుగుజెందుట, కంపెనీవారి యోడలలో విచిత్రముగ నతడు హిందూదేశము చేరుట, గుండువేల్చుకొని యాత్మహత్య చేసుకొనబూనుట మొదలగు విషయము లాసక్తిని కలిగించును. అందుచే ఆ యా సందర్భ ములలో తామెట్లు ప్రవర్తించవలసి యున్నదని బాల బాలికలు సులభముగ గ్రహింపగలరు. ఇట్టి యుదాహరణములో నుపా ధ్యాయుడింకను వెదకి తయారు చేసికొనవలయును.

3. నల్లబల్ల యుపయోగము: — బోధకునికి ఎక్కువగ తోడ్పడు సాధనములలో నల్లబల్ల ప్రధానమైనది. కొందరు నల్లబల్ల నుపయోగించకయే పాఠము ముగింతురు. అయినను పాఠవిషయములు లెన్నగా విద్యార్థుల మనసులలో నాటు కొనును. మఱికొందరు నల్లబల్లతోడనే ప్రారంభించి, స్థల

ముఖ్యాంశములను దాని నుపయోగించి, పాఠమునకు చాలక పోవుటచే మొదటిభాగమునందు గుర్తించిన వివరములను తుడిచి వేసి క్రొత్తవానిని వ్రాయుదురు. అయినను ఈ క్రిందిమార్గములు సరియగునవి కావు. నోటితో పాఠసంగ్రహము ముగించబడినతరువాత జరిగిన పాఠమునందలి ముఖ్యాంశములు గుర్తింపబడియుండనిచో విద్యార్థుల మనసులో నవి నాటుకొనజాలవు. సంగ్రహముగ వానిని గుర్తించియుండినచో వీనిని చూచి పాఠమంతయు సులభముగ వారు తిరిగి చెప్పగలుగుదురు. నల్లబల్లసారాంశము (Blackboard summary) పాఠమును పునర్విమర్శ (Revison) చేయునప్పుడు కూడ తోడ్పడ గలదు. చెప్పిన ప్రతివిషయమును నల్లబల్లమీద వ్రాయుచు వచ్చిన యెడల వాని ప్రాముఖ్యమును గుర్తించుటకు వీలుకలుగదు. విద్యార్థుల దృష్టి చెదరిపోవును. అందుచే ముఖ్యవిషయములను గీతలుగీచి గుర్తించుచు వానిక్రింద గమనింపదగినవానిని సంగ్రహముగ వ్రాయుట మంచిది. కొందరు పాఠమున రెండు నల్లబల్లల నుపయోగింతురు. ఒకదానిమీద క్రొత్తపేరులు, తేదులు, గుర్తింపదగిన విషయములను రెండవదానిమీద పాఠసంగ్రహమును గుర్తింతురు. ఇదియు నుపయోగకరమగు విధానమే. మాదిరి నల్లబల్ల సారాంశములను ఈ దిగువపొందుపఱచితిమి. వానిని గమనించి యుపాధ్యాయుడు క్రొత్తవానిని తయారుచేసుకొనవలయును.

### నల్లబల్ల సారాంశము

### పాఠము – చరిత్ర – భాగము – శివాజీ

| | |
|---|---|
| శివాజీ మహారాష్ట్ర వీరుడు. బాల్యము నుండి భక్తిప్రవర్తనయు, హిందూధర్మముల నుద్ధరించుటయం దాసక్తియు కలిగియుండెను. సైన్యముల గూర్చుకొని క్రమముగ రాష్ట్రము నేర్పరచెను. సుల్తానులను చక్రవర్తులను సంధిచేసుకొనిరి. 1674 లో ఛత్రపతిగా పట్టాభిషిక్తుడయ్యెను. చక్కగ పరిపాలించెను. భరతమాత పుత్రులలో నగ్రగణ్యుడు. | 1627 జన్మించెను.<br>విద్యాభ్యాసము–తల్లియు, దాదాజీ ఖాండ్ దేవ్ను తయారుచేసిరి.<br>భవానీ దాసుడు.<br>మొదటి విజయములు –కళ్యాణి, రాయఘుర్, పురంధర్ కోటలు.<br>అఫ్జల్ ఖాన్ } ఓడిపోవుట<br>షైస్తఖాన్ }<br>1662 – పాదుషాతో సంధి<br>1674 – ఛత్రపతిగా పట్టాభిషేకము. పరిపాలనము – పాదుషా మోసము, తప్పించుకొనుట.<br>1680 మరణం<br>శివాజీ ప్రశస్తి |

4. మూలగ్రంథములనుండి చదువుట:—మూలగ్రంథములు (Sources) మన దేశచరిత్ర కధికముగా లేవు. ఏలననగా: చారిత్రక పరిశోధన మిటీవలనే ప్రారంభమయినది. చాలకాలమునుండి చారిత్రక పరిశోధనము జరుగుచువచ్చిన దేశముల చరిత్రలలో నివి యధికముగ లభించును. ఆంగ్లేయ చరిత్రకు మూలగ్రంథము లసంఖ్యాకములు గలవు. వీనిని చదివి యందుండి ముఖ్యములగు భాగములను పాఠకులకు వినిపించుటచేతను, విద్యార్థులచేతనే చదివించుటచేతను వారి యూహాశక్తి వృద్ధిబొందును. పరస్పర సంబంధము లేని భాగములను చదివి వానికి సంబంధమేర్పరచుటకు ప్రయత్నము

చేయుటచే చారిత్రక పునర్నిర్మాణము (Historical reconstruction) న మంచి యభ్యాసము గలుగును. కావున మూలగ్రంథములనుండి చదివి వినిపించుటయు, బాలురచే చదివించుటయు ఉపయోగకరములు

మన దేశ చరిత్రను బోధించునపుడీ విధముగా మూల గ్రంథముల నుపయోగింపవచ్చును

1. మహావీరుల చరిత్రములనుగూర్చి కవులు తమ కావ్యములలో ప్రాసంగికముగ నుసిన సూచనలు—వీని యందు కొంతవఱకు అతిశయోక్తి యుండును. మఱియు నొకేపక్షమునందు అభిమానముతో వ్రాయబడియుండుటను నిజమగు చరిత్రాంశములను నిష్పక్షపాతబుద్ధితో గ్రహించుటకు వీలుగలుగను. పద్యములు, శ్లోకములు నుపయోగింపబడుటచే పిన్నవారికి గ్రహించుట దుర్లభముగ నుండును. అయినను వీనిని జాగ్రత్తతో నుపయోగించుట ప్రయోజనకారిగ నుండగలదు. కృష్ణదేవరాయలనుగూర్చి బోధించునపుడు కృష్ణరాయవిజయము, మనుచరిత్రము, పారిజాతాపహరణము మొదలగు కావ్యములనుండి సంగ్రహముగ చదివి బోధించుట యుత్తమము.

2. విదేశయాత్రికులు దినచర్యపుస్తకములలో మన దేశపు పరిపాలనము, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మున్నగు వివరములనుగూర్చి వ్రాసియున్నారు. వాని భాషాంతరీకరణములను చదువవచ్చును. ఫాహియాన్, మెగస్తనీస్, హ్యూయాన్ స్యాంగ్ మున్నగు వారి వ్రాతలనుండి చదువవచ్చును.

3. శిలాశాసనములు తామ్రశాసనములు, విజయ స్తంభములు మున్నగువానియందలి వ్రాతల భాషాంతరీకరణములను చదివి వివరించుచుండవలెను. పూర్వకాలమున చక్రవర్తులు రాజులు తాముచేసిన దానములను, పొందిన విజయములను శాసనములుగ నేర్పఱచిరి. 'నికోలోకొంటీ' అను ఇటలీ యాత్రికుడును మరియొక పారశీక రాయబారి 'అబ్దుల్ రజాక్' యును వ్రాసిన విషయములు చదివినచో మన విజయనగర రాజధానిని గూర్చి విద్యార్థులు సులభముగ గ్రహింపగలుగుదురు.

4. తరగతి పెద్దదైనచో విద్యార్థులకు గ్రంథాలయ పరిచయము కలిగించవచ్చును. ఏయే విషయముల కేయే గ్రంథములను చదువవలయునో, ఉపాధ్యాయుడు ముందుగా నిర్ణయించి, ఆ పుస్తకములను చదివి, విషయముల నెట్లు గ్రహింపవలయునో విద్యార్థులకు మాదిరిగా చూపించుచుండవలెను. చరిత్రాత్మకములగు నవలలు, జీవిత చరిత్రములును ఇట్లు చదువుట కెక్కువ యుపయోగపడును.

## ప్రశ్నలు

1. చిత్రములు, మాదిరులు, పటములు - వీనిని చరిత్రను బోధించుటలో నెట్లు ఉపయోగింతువు?
2. బాలుర యనుభవములనగా నేమి? చరిత్రను బోధించుటలో వీని నెట్లు నుపయోగించుకొనవచ్చును?
3. నల్లబల్లను ఉపయోగించుటలో చరిత్రోపాధ్యాయుడేయే యంశములను గమనించవలయును?

చూచిన చాలదు. నిర్ణయించునపుడు మంచిపుస్తకమున కుండవలసిన లక్షణములు వానియందున్నవో లేవో పరీక్షించవలయును. అవి యీ క్రింద పొందుపఱుపబడినవి

1. 'చిన్నపిల్లలకు చిన్నపుస్తకము' అను న్యాయము చరిత్రకు అన్వయింపదు. చరిత్రపుస్తకము చిన్నదయిన యెడల కేవలము విసుగుపుట్టించు ముఖ్యవిషయములు మాత్రమే కలిగియుండును. హృదయాకర్షకములగు రచన లుండవు. అందుచే పుస్తకము సర్వాంగసుందరమై చక్కగా వ్రాయబడి యుండవలెను.

2. పుస్తకమున వివరములన్నియు నిమిడియుండవలెను. విసుగుగలిగించునంత పెద్దదికాకూడదు.

3. విషయములకు గల ప్రాముఖ్యమును తేటతెల్లముగా నిరూపించగలిగి యుండవలయును. అతిసామాన్య విషయముల కెక్కువ ప్రాముఖ్య మియ్యకూడదు. ముఖ్యవిషయములను తేలికగ నిరూపించరాదు.

4. చరిత్రయందలి విశాలములగు సమస్యలను, ఉద్యమములను గమనించుచు, మహాసంగ్రామములచేతను, మహాకర్తలచేతను చరిత్రలో నెట్లు మార్పులు గలుగునో నిరూపించవలయును. అందుచే కాలానుక్రమణము కేవలము ఉపయోగపడదు.

5. చరిత్రాంశములను గూర్చి నేటి యభిప్రాయములను తెలుపవలయునుగాని, చరిత్రపరిశోధనల ఫలితముగా తప్పులని నిరూపింపబడిన తాతలనాటి వ్రాతలనే వ్రాయు

గూడదు. అట్లు చేయనిచో చరిత్రయొక్క సత్ప్రభావము నశించు ముప్పుగలుగును.

6. పుస్తకము ఖరీదు అధికముగ నుండరాదు. ఉండినచో బీదసాదలందరకు నందుబాటులో నుండ నేరదు.

(B) పుస్తకము నుపయోగించుట:— మంచిపుస్తకమును నిర్ణయించిన తరువాత దాని నుపయోగించుట కూడ జాగ్రత్తతో జరుగవలయును. క్రమముగ నుపయోగించనపుడు పాఠమునకు పుస్తకమెంత తోడ్పడునో చేతగాని యుపాధ్యాయుని చేతిలో నంతే కీడు తెచ్చును. పుస్తకమును బడియందును, ఇంటియందును చదువుకొని రమ్మని యాజ్ఞాపించినచో దాని యుపయోగము తగ్గిపోవును. పుస్తకము నుపయోగించునపుడు ఈ క్రిందివిషయములను గమనించ దగును

(i) పాఠ ప్రారంభమున:— జరుగబోవు పాఠమున బాలురు గమనింపదగిన ముఖ్యవిషయములను ముందుగ ముచ్చటించవచ్చును. పుస్తకమున వానిని గమనింపజేసినచో వానియందు బాలురదృష్టి నిలుచును. లేదా పుస్తకమునందలి పటమునుగాని, చిత్రమునుగాని యాధారము చేసికొనవచ్చును.

(ii) పాఠమధ్యమున:— జరిగిన పాఠభాగమునకు సంగ్రహముగ పునర్విమర్శ (Review) చేయించి, పుస్తకమున దానిని బాలురు గమనించునట్లు చేయవచ్చును. ముఖ్యసూత్రములను వివరించి దానిలో గుర్తింపజేయ

వచ్చును. కార్యకారణసంబంధమును దృఢముగ వివరించి, పుస్తకమున దానిని బాలురచే గమనింపజేయవచ్చును. తాను చెప్పిన విషయములేగాక పుస్తకములో తెలుపబడిన యితరవిషయములను గుర్తింపజేయవచ్చును. పటమునయున్న స్థలముల, రాజధానుల, రాజ్యవ్యాప్తిని గుర్తింపజేయవచ్చును.

(iii) పాఠాంతమున:—

1. జరిగిన పాఠవిషయములను పునర్విమర్శచేయుచు పుస్తకమునుండి గుర్తింపజేయవచ్చును.

2. పాఠవిషయములను పుస్తకమునుండి చదివించి, సంభాషణరూపముగ వివరింపజేయవచ్చును.

3. పుస్తకమునుండి పాఠమునకు సంబంధించిన భాగములను చదివించి వివరించవచ్చును.

(iv) పుస్తకము నుపయోగించుట కాక్షేపణలు, సమాధానము:—

1. పాఠపుస్తకమును చిన్నపిల్లలు చదువజాలరు. చదివినను వారి కాసక్తి నిలుచుట దుస్తరము.

ఏ తరగతి బాలుర చదువుటకు వీలగునట్లా తరగతి పుస్తకములు వ్రాయవచ్చును. అసలే చదువురానివారు చదువు నేర్చుకొనవలయును. అంతియెకాని పిల్లలు చదువజాలరని పుస్తకమును వాడకుండుట మంచిదికాదు.

2. పుస్తకమున విషయము లధికముగ నుండినచో చదువరులకు విసుగుపుట్టించును. బోధకుల స్వేచ్ఛనరికట్టును.

ఈ మాట కొంతవఱకు వాస్తవమే. కాని యప్రస్తుతపు వివరములను విడిచి, చక్కగ వ్రాయబడిన పుస్తకముల నుపయోగించుట మంచిది. పుస్తకమును బోధనకు ప్రధాన సాధనముగ నుపాధ్యాయు డుపయోగింపవచ్చును. కాని దానికి దాసుడు (Slave) కాగూడదు.

౩. పుస్తకమున వివరింపబడిన ప్రకారమే విద్యార్థులు చరిత్రాంశములను గమనింపగలరుగాని స్వయముగ నూహించి పరస్పరసంబంధమును, పరిణామమును ఏర్పఱచుకొనుట కవకాశములు లేవని చెప్పుదురు.

ఇదియు చాలవఱకు నిజమేయగును. కాని యుపాధ్యాయుడు క్రమముగు మార్గదర్శకత్వము చేయుచుండిన చో, నిది యంతరించును. ఏవిషయముల నెట్లు గ్రహించవలయునో యుపాధ్యాయుడు నిరూపించు చుండవలయును.

(V) స్వతంత్రమగు యోచనకు తోడ్పడుట:-పుస్తకము నుపయోగించుట చాల యవసరమని తెలిసినది. ఉపయోగించుటలో గలుగు లోపములను సవరించుకొనినచో ప్రయోజన మధికముగ కలుగును. తనకు తాను వివరములను గ్రహించి, చారిత్రక సమస్యలను ఉద్యమములను గ్రహించుట కవకాశము గలుగును.

1. చరిత్రకు సంబంధించిన యభ్యాసములను చేయించుట:—

బౌద్ధమతమును వ్యాప్తిపొందించుట కై యా చక్రవర్తుల ప్రయత్నములను చరిత్రపుస్తకమునుండి సమస్యా

యింపజేయదగును. కృష్ణదేవరాయల విజయములను గమనింపజేయదగును.

2. ఖాళీపటమున చరిత్రలో చదివిన వివరములను గుర్తింపజేయుట — సముద్రగుప్తుని దక్షిణదిగ్విజయము — కృష్ణరాయల విజయము - విక్రమాదిత్యుని రాజ్యవ్యాప్తి మొదలగునవి.

3. కొన్ని వివరములను చరిత్రపుస్తకమునుండి గమనింపజేసి వానినిబట్టి హేతువులనుగాని, ఫలితములనుగాని నిర్ణయింపజేయవచ్చును. మహమ్మదీయుల విజయపరంపరలకు ముఖ్యకారణము హిందూరాజులలో నైకమత్యము లేకుండుటయే అనియు మహారాష్ట్రవిజృంభణమునకు కారణము నైసర్గికపరిస్థితులే యనియు పుస్తకము సాయమునసే గుర్తింపజేయదగును.

(vi) ఇతరపాఠములతో సంబంధము (Correlation with other subjects)— పాఠశాలలో నేర్పబడు విషయము లన్నియు పరస్పరసంబంధము కలిగియున్నవి. చరిత్ర, భూగోళము, సివిక్సు, గణితము, శాస్త్రపాఠములు, భాష, సారస్వతము మొదలగునవి ప్రత్యేకముగ బోధింపబడినను, సాధారణజ్ఞానమున నంగముల వంటివి. అవయవములకు పరస్పర సహాయమున నుపయోగ మధికమగునట్లు, పరస్పరసంబంధ మేర్పడుటవలన నీ పాఠవిషయములుకూడ సార్థకములై, జీవితమునకు సంబంధముకలిగి, ఎక్కువ ప్రయోజనకరములుగ నుండగలవు. చరిత్రకును మిగిలిన విషయములకును

మతియొక సంబంధము కలదు. ప్రతివిషయమునకు చరిత్ర కలదు. సారస్వతమునకు, శాస్త్రములకు నిట్టి చరిత్రలున్నవి. ప్రతి విషయమును దేశచరిత్రను మార్పు సేయు సామర్థ్యము కలిగియున్నది.

భూగోళము : మన దేశము స్థాభౌతిమగుటచేతను, నీటి వసతి, శీతోష్ణ పరిస్థితులు అనుకూలముగ నుండుటచేతను మన చరిత్ర యిట్లు పరిణమించినది. జీవితమునకై పాటుపడ వలసియుండిన ప్రజలు తమ చరిత్రము నింకొక విధముగ మార్చుకొనియుందురు. దక్షిణహిందూస్థానము చాలకాలము వరకుచరిత్రలో ప్రాముఖ్యము నొందకపోవుట కిట్టి నైసర్గిక పరిస్థితులే కారణము. ఇట్లేయితరవిషయముల నుపాధ్యాయు డూహించి నిరూపించవలయును

సారస్వతము:— దేశచరిత్ర ననుసరించి సారస్వతము వృద్ధిబొందును. ప్రజలు శాంతిని, సౌఖ్యమును కలిగి, స్వేచ్ఛాపరులై జీవించునప్పటి సారస్వతము మేలుకరముగ నుండును. యుద్ధములతోను, పరస్పర కలహములతోను, కాటకము, అనారోగ్యముతోను ప్రజలు బాధనొందునపుడు తయారయిన సారస్వతము నీరసమై, నిర్జీవమై కార్యశూరత్వము లేక యుండును. దేశభక్తిని కొంపొందించు గీతములు కావ్యములు చదువునపుడు ప్రజలలో నూతనోత్సాహము పుట్టును. ఉద్యమము లన్నియు ఫలించును.

(vii) చిత్రలేఖనము:— దీనియందు కౌశల మధిక మయిన కాలపుచరిత్రకు సంబంధమేర్పడును. ఎక్కువ యుప

యోగకరముగ నుండును. యుద్ధభూమిలో సైన్యములు ఫలు పేర్పఱచుట, యుద్ధవీరుల పరికరములు, యుద్ధసామాగ్రి యందలి విశేషములు – మొదలగునవి నిరూపించినచో చరిత్ర కన్నులకుకట్టినట్లుండును. ఇంతియగాక తాజ్ మహాల్, కుతుబ్ మీనార్, హంపి దేవాలయము మున్నగువాని యాకృతుల (Models) ను తయారుచేసి యుపయోగించినచో బోధన హృదయంగమముగ నుండును.

## ప్రశ్నలు

1. పాఠపుస్తకమును నిర్ణయించునపుడు మన మే విషయములను గమనించవలెను ?
2. పుస్తకము పాఠప్రారంభమునందును, మధ్యను, అంత్యమునను ఎట్లు ఉపయోగపడును ?
3. పుస్తకము నుపయోగించకూడదనువారి యాక్షేపణలేవి ?
4. పైన తెలిపిన యాక్షేపణలకు సమాధానములేవి ?
5. పుస్తకము విద్యార్థులయందు స్వతంత్రమగు యోచన కెట్లు తోడ్పడును ?
6. భూగోళమునకు చరిత్రకు గల సంబంధమేమి? చరిత్రకు, సారస్వతమున కెట్టి సంబంధము కలదు ?

# 10. వివరణక్రియలు (Expression Work)

## ప్రాజెక్టులు

విద్యార్థులు చరిత్రాంశములు నేర్చుకొనినంత మాత్రమున లాభము లేదు. నేర్చిన వాని అర్థము చేసుకొని వాని విలువను గ్రహించి తిరిగి చెప్పగలిగి యుండవలయును. మరియు ప్రశ్నలకు సమాధానములను సరిగా నుత్తరరీతి వివరించవలయును. కావున విద్యార్థులు దృఢముగ గ్రహించునట్లు చేయుటకు క్రిందిసాధనములు ఉపయోగించును. వీని ననుసరించిననేగాని యుపాధ్యాయుని బోధసమర్థనము గానేరదు.

1. నాటకప్రయోగము: చరిత్రలోని యంశములు నాటకపద్ధతి కెక్కువగ ననుకూలించును. మహాపురుషుల జీవితములు, యుద్ధములు, మతప్రవక్తల ప్రచారములు మున్నగు నవి నాటకప్రయోగమున సులభముగ గ్రహింపజేయవచ్చును. ఇదివరకు వ్రాయబడిన పెద్ద చరిత్ర నాటకములు తరగతులలో ప్రయోగార్హములు కావు. పాఠము ముగియగానే అందలి విషయము లెట్లు ప్రదర్శించుటకు వీలగునో నిర్ణయించి త్వరలో ప్రయోగము జరుపవలయును. లేదా విశేషబుద్ధియగు నుపాధ్యాయుడు తయారుచేయవచ్చును. శివాజీ మహమ్మదీయ వీరులతో సమావేశము చేయుట, మొగలు చక్రవర్తి చెఱలోబడుట, యుండుండి వెలువడుట చక్కని ఘట్టము. ప్రతాపరుద్రునికథ, బొబ్బిలికథయు నిట్లుపయోగపడును.

(c) మాదిరులు తయారుచేయుట:— చరిత్ర ప్రసిద్ధి గల వస్తువులను, సామాగ్రికిని మాదిరులు తయారుచేయుటచే వాని విషయములు బాగుగను వ్యక్తమగును. బంకమట్టితోను, సీమసున్నముతోను, కొయ్యతోను కూడ మాదిరులు తయారుచేయవచ్చును. కాని యిది చాల ప్రయాసకరమగు పని. విద్యార్థుల పరస్పరసహాయముననేగాని నెరవేరదు. ఈ పరికరములతో పనిచేయగల సామర్థ్యమును ఆసక్తియు విద్యార్థులకును, ఉపాధ్యాయులకును ఉండుట చాల యరుదు. విరూపాక్ష దేవాలయమందలి రాతిరథము, టాజ్‌మహాల్, కుతుబ్‌మినార్ యున్నగు వాని యాకృతులను మాదిరులుగ తయారుచేయించి యుపయోగించదగును.

8. ప్రాజెక్టులు:— ఇవి పైన వివరింపబడియేయున్నవి. అభినయరూపములుగ చేయగలిగిన విషయముల కిదియే పేరు. పాఠపుస్తకములలోనుండు సన్నివేశముల ననుసరించి చిత్రములలో గుర్తించిన వివరములను సంగ్రహించి విద్యార్థులు స్వయముగ అభినయపూర్వకముగనో, మాదిరులరూపముగనో పనిచేసి చూపించుటయే ప్రాజెక్టుపద్ధతి. దీనివలన బాలురు గ్రహించిన జ్ఞానము దృఢమగుటయే గాక రచనాశక్తికూడ కలుగును. కావున సాధ్యమయినన్ని ప్రాజెక్టులను తయారుచేయించి యుపయోగించదగును.

## ప్రశ్నలు

1. వివరణక్రియ యనగానేమి? దీని యుపయోగమేమి?
2. చరిత్రపాఠమున నాటక ప్రయోగమునకు గల యవకాశము వివరింపుము.

3. చరిత్రను బోధించునపుడు చేతిపనులు పనితో నేయేవిధముగ చేయింతువు ?

4. ప్రాజెక్టులనగా నేమి ? ఈ పద్ధతిననుసరించి ఏవిధముగ చరిత్రాంశము లను బోధింపవచ్చును ?

# 11. విహారములు

చరిత్రను బోధించుటలో విహారములు చాలవఱకుపయోగించును. చారిత్రక ప్రసిద్ధిగల స్థలములను దర్శించినపుడును, అట్టి వస్తువులను చూచినపుడును విద్యార్థులకు తన్మయత్వము కలుగును. తాత్కాలికముగ నాయా కాలములలోనికి మారుదురు. విషయములు సులభముగా గ్రహింపగలరు. విహారముల కరుగునపుడు విద్యార్థులలో సంఘశక్తి వృద్ధియగును. మఱియు, వివరములను స్వయముగ తెలిసికొనియుండి చరిత్రాంశములను మాత్రము గ్రహించి యాన్వేషణల కెడమీయని చరిత్రను తయారు చేయుట కవకాశము కలుగును. చారిత్రకుని కార్యమంతయు వారికి స్ఫురించును. పవిత్రమగు జాతీయభావ మంకురించును. కావున నుపాధ్యాయులు విహారముల నేర్పఱచుట మంచిది.

(అ) చిత్రవస్తుప్రదర్శనశాలకు విహారముల నేర్పఱచినచో మన పూర్వులనుగూర్చిన చారిత్రక విషయము లన్నియు విద్యార్థులు స్వయముగ గ్రహింతురు. (1) ఆయా కాలములలోని జనుల యాచార వ్యవహారములు, సంఘస్థితి

మొదలగు విషయములను గూర్చిన శాసనములను, వ్రాతలు చదివి తెలిసికొనవచ్చును. (c) అప్పటి వీరుల యొక్క యుద్ధ విశేషములను, అస్త్ర శస్త్రములను ధరించినట్టుల యున్నను వానిని చూపవచ్చును. ప్రజలకు ప్రభుత్వమువారికిని దొరికిన పురాతనవస్తువులు చరిత్రకు సంబంధించినవానిని వీనియందు ప్రదర్శింతురు. విద్యార్థులు వానిని చూచి యిప్పటికిని నేటికిని గల వ్యత్యాసములను గమనింపగలరు.

(d) చరిత్ర ప్రసిద్ధిగల స్థలములకు విహారములు వెళ్ళినచో విద్యార్థులకు జాతీయభావము దయించును. సాధారణముగ స్థానిక చరిత్రను బోధించునపుడివి సాధ్యపడును. బొబ్బిలియుద్ధము నేర్పునపుడు పూర్వము యుద్ధము జరిగిన స్థలమును, కోటయుండిన స్థలములను చూపించవచ్చును. హంపీక్షేత్ర సమీపస్థులు అచ్చటికి వెళ్ళి శిథిలములను చూడవచ్చును. అమరావతీ ప్రాంతమువారచ్చటికిపోయి చూడవగును. విద్యార్థుల వయస్సు ఎక్కువగనుగుచో, ధనవ్యయమునకోర్చి దేశమందంతటను గల చరిత్ర ప్రసిద్ధక్షేత్రములను చూడవచ్చును.

1. వీనినేర్పాటుచుట, నిర్వహించుటయు చాల ప్రయాసకరము. దర్శింపవలసిన క్షేత్రమును ముందుగ నుపాధ్యాయుడు నిర్ణయించుకొని, తానచ్చటికిపోయి గమనింపజేయదగిన విషయములను నిర్ణయించుకొనవలెను. కేవలము నాసక్తి తోట్పుటకు మాత్రమే విహారముల నేర్పాటుచుట మంచిది కాదు.

2. విహారముల యందలి యభిప్రాయము నుపాధ్యాయుడు సృష్టించుకొని, బాలురచే దానిని గమనింపజేయవలెను. అచ్చట గల వింతలను తొందరలో చూపించి తిరిగి తీసికొని వచ్చుట కార్యకారి కానేరదు.

3. చరిత్రపాఠమున నా యా భాగములకు సంబంధించిన విషయములు మాత్రము గ్రహింపజేయవలయును. ఇంక కొంత కాలమున కుపయోగపడు విషయముల నిప్పుడు గమనింపజేయరాదు.

4. విహారములకు ముందుగా వారెచ్చటికి పోయి యేమి చూడవలయునో వాని నెట్లు గుర్తించవలయునో వానినుండి యేయే చారిత్రక విషయములు గ్రహింపవలయునో విద్యార్థులకు తెలియజేయవలయును.

5. విహారమధ్యమున నెచ్చటెచ్చట యే యే అంశములను గుర్తించవలయునో నిరూపించవలయును. మాదిరిగ తాము గుర్తించి యుపాధ్యాయులు విద్యార్థులకు స్పష్టపఱచవలయును.

6. విహారములు పూర్తికాగానే యెవ్వరెవ్వరే విషయములను గమనించిరో తెలుసుకొని వానియందు గ్రహింపదగిన చారిత్రక సాంప్రదాయములను చర్చించి నిరూపించవలయును అట్లు చేయుటచే విద్యార్థులు తమ ప్రయత్నము సార్థకమయినదని తలచి యానందింతురు. విహారములవలన గలుగు ఫలము సంపూర్ణముగ దొరకును.

## ప్రశ్నలు

1. విహారములనగా నేమి? చరిత్రోపాధ్యాయుని కివి యెట్లు తోడ్పడును?

2. విహారముల నేర్పఱచునపుడు గమనింపదగిన విషయము లేవి?

3. విహారములను జయప్రదముగ నిర్వహించుట కుపాధ్యాయుడేమి చేయవలయును?

4. చిత్రవస్తు ప్రదర్శనశాలలకు విహారముల నేర్పఱచుట యెట్లు లాభకరము?

5. విహారముల నెచ్చటెచ్చటికి నేర్పఱచుట యుక్తము?

---

# 12. ఉపాధ్యాయుడు తయారగుట

[Teacher's preparation]

చరిత్రను బోధించుట కర్హుడగుటకు ఉపాధ్యాయుడు కొంత పాటుపడవలయును. ప్రతి యొకడును చరిత్రను బోధించుట కష్టము. అందుకొఱకు కొంత ప్రయత్నము చేయవలయును.

1. చరిత్ర పుస్తకములను విరివిగా చదివి యందలి విషయములను గ్రహించవలెను. పరిశోధనల ఫలితముగా చరిత్రయం దభిప్రాయములు మారిపోవుచున్నవి. ప్రాచీన పుస్తకములను చదువుచుండినచో నా కాలపు భావములు మాత్రము కలుగును. నేటి కాలపు పుస్తకములను విశేష

ముగ చనావుచు నిరంతరము క్రొత్త యాదర్శములను కలిగి యుండవలెను.

2. దేశచరిత్రయందు దాక్కొనిన విషయముల కొంత ప్రాముఖ్యము కలదో ఉపాధ్యాయుడు విమర్శించుకొని విద్యార్థులకు తెలియజేయవలయును.

3. మూల గ్రంథములను చదువుకొని యుపాధ్యాయు లందలి భావముల సక్లే గ్రహించి విద్యార్థులచే గ్రహింప జేయవలయును.

4. చారిత్రక ప్రసిద్ధి గల క్షేత్రములను తాను దర్శించి యచ్చటి వివరములను స్వయముగా తెలుసుకొనవలయును, ఇందువలన తననేక విధములు దేశభక్తియు మహాపురుషారాధనమును అలవడును క్రమముగ వానిని బాలురకు కలిగించ వచ్చును.

5. ముఖ్యవిషయము లెట్లునడుచుచున్నవో గమనింప జేయవలయును. కేవలము తేదీలతోను యుద్ధములతోను ప్రొద్దుపుచ్చినచో చరిత్రయందలి ప్రధానాంశము మఱుగు పడును.

పాఠక్రమ సూచికలు తయారుచేయుట

ఉపాధ్యాయుడు తాను బోధించు పాఠముయొక్క క్రమమును ముందుగ నూహించుకొని, నిర్ణయించి, వ్రాసు కొనుట మంచిది, సముద్రయానము చేయు నావికునకు దిక్సూచియంత్రము వలె నీపాఠక్రమసూచిక యుపాధ్యాయుని బోధనకు తోడ్పడును. అది లేనియెడల పాఠమునకు చక్కని

తాత్పర్యము తేర్పఱుచుకొని వానిని పొందుట కనువగునట్లు బోధించుట సాధ్యము కాదు. బోధన యందారితేరిన ఉపాధ్యాయులుకూడ పాఠ్యక్రమసూచికలు తయారుచేయుట కుంఠితులు. ఇతరుల కత్యావశ్యకమని వేరుగ చెప్పనేల ?

## ఎట్లు తయారుచేయవలయును ?

1. ఆయా మహాపురుషుల యొక్కయు, కాలము యొక్కయు కాలానుగుణ్యములగు లక్షణములను స్పష్టపరచు విషయములను నోట్సుగా సంగ్రహించుకొనవలయును.

2. చరిత్రయందు ప్రస్ఫుటముగదోచు విశాలములగు భావములను, కార్యకారణ సంబంధములను పొందుపఱచవలెను.

3. విద్యార్థుల యనుభవములకును చరిత్రాంశములకునుగల సాదృశ్యములను భేదములను గమనింపజేయవలయును.

4. చరిత్రవిషయములు విద్యార్థుల పూర్వజ్ఞానములో నుండుట యసంభవమగుటచే వానిని హృదయాకర్షకములుగ జేసి బోధించుటకు చిత్రములను, కథలను, పాటలను, పద్యములను ప్రాసంగికముగ నుపయోగించవలయును.

5. స్వయముగ నూహించుటకు, విమర్శించుటకు, నిర్ణయము చేయుటకును సాధ్యమగునన్ని యవకాశములు కలిగించవలయును.

| అంశము | పద్ధతి |
| --- | --- |
| నేడు ఛత్రపతి శివాజీనిగూర్చి తెలిసికొందమని తెలిపి యుద్దేశము ప్రకటించవలెను. | శివాజీ యేల ధన్యుడయ్యెను? దేశగౌరవము నెట్లు కాపాడెను? |
| **ప్రదర్శనము** | |
| (a) జననము, బాల్యము:— శివనేరు అను కొండదుర్గములో పుట్టెను. తల్లి జిజాభాయి, తండ్రి షాజీభాన్స్లే. దాదాజీ ఖాండుదేవ్ పెంపకము - మాతృదేవతారాధన- పూర్వచరిత్రలు వినుట. | శివాజీ తండ్రి యెచ్చట కొలువు చేయుచుండెను? శివాజీ యెక్కడ పుట్టెను? అతని నెవరు పెంచిరి? తండ్రి సాయపడకుండుటేల? అని ప్రశ్నించి, అంశములోని విషయములను రాబట్టవలెను. |
| (b) విద్యాభ్యాసము:- గుఱ్ఱపుస్వారి- ఆయుధవిద్యలు నేర్చెను. సైన్యములతో జేరి సంచరించుచు ధైర్యసాహసములను సంపాదించెను. భవానీపూజయు దేశభక్తియు నలవరచుకొనెను. | బడిలో చదివియుండెనా? తల్లి వలన నే యే సంగతులు గమనించెను. ఖాండ్ దేవ్ బోధించిన విషయములేవి? దేశభక్తి గల యువకుడెట్లాయెనని ప్రశ్నించి రాబట్టవలెను. |
| (c) కొండవీరులను చేర్చి, కొల్లగొట్టసాగెను. సైన్యము వృద్ధిచేసెను పురందర్, కల్యాణిదుర్గముల స్వాధీనపఱచుకొనెను. బీజాపూరుసుల్తాను అఫ్జల్ ఖానును బంపి మోసము చేయదలచెను. కాని శివాజీ వానిని చంపెను. | పరాక్రమమును ప్రపంచమున కెట్లు చూపించెను? బీజాపూర్ సుల్తానున కేల భయముకలిగెను? అఫ్జలుఖాను నేల బంపెను? శివాజీ అతని నెట్లు సంహరించెను? అని ప్రశ్నించి అంశమునందలి విషయములను రాబట్టునది. |

| అంశము | పద్ధతి |
| --- | --- |
| సంబంధపఱచుట: అఫ్జల్ ఖాన్ | సమావేశచిత్రమును చూపించునది. |
| (d) రాజ్యస్థితి.— ఢిల్లీచక్రవర్తి యతని నోడించదలచి శైస్తఖానుని పంపెను. లాభము లేక మోసము చేసి రప్పించి చెఱనుంచెను. శివాజీ తప్పించుకొని రాయగడమున పట్టాభిషిక్తుడాయెను. ఛత్రపతి యాయెను. | ఢిల్లీచక్రవర్తి యతనిని పట్టుకొనుట కెట్లు ప్రయత్నించెను? మాయచేసి యెట్లు చెఱయందుంచెను? అతడెట్లు విడివడెను? ఛత్రపతి యనగా నేమి? అని ప్రశ్నించి రాబట్టునది. |
| (e) పరిపాలనము:— ఆఱుసంవత్సరము లేలెను. సైనిక శిక్షణము ఉత్కృష్టమైనది. అష్ట ప్రధాన మంత్రివర్గము - పన్నులు న్యాయముగ నిర్ణయించెను. స్త్రీలకు, అనాథలకు సాయపడెను. | శివాజీపరిపాలన మెట్లుండెను? అతడే రాజ్యముల జయించెను? అష్టప్రధానమనగా నేమి? పరిపాలనా పద్ధతి యెట్లుండెనని ప్రశ్నించి రాబట్టునది. |
| (i) శీలము:— (1) మాతృదేవతారాధనము (2) భవానీభక్తి (3) భారతదేశగౌరవ కాంక్ష (4) స్త్రీల గౌరవము కాపాడుట (5) ధర్మప్రవర్తనము. | అంశములోని విషయములపై తగు ప్రశ్నలనడిగి రాబట్టునది. |
| సామాన్యీకరించుట:— శివాజీ మహారాష్ట్రనాయకుడు- దేశభక్తుడు దేశగౌరవమును కాపాడెను. హిందూధర్మముల నుద్ధరించెను. మహా | అంశములోని విషయముల నల్లబల్లసారాంశముగ స్ఫురించునది. |

| అంశము | పద్ధతి |
|---|---|
| గా స్వతంత్రరాజ్యము స్థాపించెను. చక్కగ పరిపాలించెను.<br><br>క్రీ. శ. 1627 పుట్టుక<br>,, 1674 రాయఘడలో ఛత్రపతియగుట-పట్టాభిషేకము<br>,, 1680 కాలధర్మము | |
| **అంత్యపరీక్ష**<br><br>శివాజీ మహారాష్ట్ర చక్రవర్తి. సామాన్యముగ విద్యాభ్యాసము చేసెను. తల్లిని దైవముగ జూచెను. భరత మాత గౌరవమును కాపాడెను. సత్ప్రవర్తన గలవాడు. మీరందరు నతని ననుకరింపదగును. | బోధింపబడిన విషయములు బాలురెంతవరకు గ్రహించిరో తెలుసుకొనుటకు అంశములో గుర్తించిన సమాధానములు రాబట్టుటకు తగిన ప్రశ్నలను వేయునది. |

## బోధనోపకరణములను తయారుచేయుట

1. చారిత్రక ప్రసిద్ధిగల చిత్రములు:—వీనిని మంచి కాగితములమీద రంగులతో తయారుచేయవచ్చును. బౌద్ధ దేవాలయము - పాటలీపుత్రనగరము - స్తూపములు - విద్యానగరము - రాతిరథము - హంపీశిథిలములు - శివాజీ - పృథ్వీరాజు - కృష్ణదేవరాయలు - తాజ్ మహాల్ మొదలగునవి.

2. చరిత్రవిషయములు నిరూపించు పటములు:—చంద్రగుప్తుని రాజ్యవిస్తీర్ణము – విజయనగర భామినీరాజ్యములు—శివాజీ రాజ్యము – బేబరు, అక్బరు, ఔరంగజేబుల కాలమున మొగలుసామ్రాజ్యము – బ్రిటిషువారి రాజ్యభాగములు – క్లైవు, వెల్లెస్లీ, డల్‌హౌసీల కాలమందలి కంపెనీ రాజ్యభాగములు – బ్రిటిషుఇండియా.

3. ప్లానులు, డయాగ్రములు :— పురుషోత్తముని సైన్యముల యేర్పాటు–పానిపట్ యుద్ధము–ఆర్కాటు ముట్టడి–చిత్తూరుముట్టడి మొదలగువానిని నిరూపించుట.

4. మాదిరులు తయారుచేయుట:—బంకమట్టితోను, సీమసున్నముతోను, అట్టలతోను – వీనిని చేయవచ్చును. టాజ్‌మహాల్ – కృష్ణదేవరాయల యాస్థానము – సోమనాథ దేవాలయము.

వీనిని చేతిపనులుగా అభ్యసింపజేయుట ప్రయోజనకరము. ఉపాధ్యాయు లిట్టివి చాలవఱకు ఊహించి తయారుచేసి యుపయోగించునది.

## ప్రశ్నలు

1. చరిత్రను బోధించుట కుపాధ్యాయు డే యే విధముగ సిద్ధపడవలయును ?
2. పాఠక్రమసూచికలనగా నేమి ? అవి యెట్లు వ్రాయపడును ?
3. వీనిని తయారుచేయునపుడు గమనింపదగిన యంశములేవి ?
4. పాఠక్రమసూచికలోని ముఖ్యభాగములేవి ?

5. బుద్ధుని చరిత్ర యనుపాఠము 4 తరగతికి బోధించుటకు పాఠ్య క్రమ సూచికను తయారుచేయుము?

6. చరిత్ర బోధనకు పనికివచ్చు ఉపకరణములను తెలుపుము?

7. ఉపాధ్యాయుడు వీని నెట్లు తయారుచేసుకొనవచ్చును?

8. "నల్లబల్ల సారాంశము" అనగా నేమి? బుద్ధుని పాఠమునకు దీని క్రింద నేమి వ్రాయుదువు?



# బోధనాపద్ధతులు

## రెండవ భాగము

---

## ( సివిక్సు )

---

## 1. పౌరధర్మములు

### ప్రాథమికపాఠశాలలలో దీనిని బోధించుటలో ముఖ్యోద్దేశములు, అవకాశము

A. ఉద్దేశ్యములు: —

(i) బాలుర జ్ఞానాభివృద్ధికి చదువు, వ్రాత, గణితము చరిత్రయు నేర్పినట్లే సివిక్సుకూడ నేర్పవలసియున్నది. ప్రాథమిక పాఠశాలలలో చదివి, విద్య పూర్తిచేసుకొని మాను వారే జనసంఖ్యలో విశేషభాగము. వారందరికి పౌరధర్మములు సరిగా తెలియవలయును. లేనిచో నాగరికపద్ధతులలో నిర్వహింపబడు ప్రభుత్వమునకు వారు తోడ్పడజాలరు.

(ii) పౌరులకు కొన్ని బాధ్యతలును కొన్ని హక్కులును గలవు. ప్రభుత్వమువలన శాంతియు, సంరక్షణమును సౌఖ్యమును, జీవితమునకు వలయు సౌకర్యములను పొందు

టకు ప్రతియొక పౌరునకును హక్కు కలదు. ప్రభుత్వము సమర్థతగ నిర్వహింపబడుటకు పౌరులు తోడ్పడవలసియున్నది. అవసరములగు పన్నులు కట్టుట, తమ యారోగ్యమును ప్రజల యారోగ్యమును చెడకుండునట్లు ప్రయత్నించుట ప్రభుత్వము కోరిన యితర సాయములు చేయుట మొదలగునవి పౌరుల విధులు.

(iii) ప్రతినిధుల సహాయమున నడుపబడు ప్రభుత్వములో పాల్గొనగలిగి యుండవలయును. ఓటు విలువను తెలుసుకొని క్రమముగ దానిని వినియోగించవలయును. ప్రజల ప్రతినిధులుగా వారియెడలను ప్రభుత్వమునందును తమకుగల బాధ్యతలను తెలుసుకొనవలయును.

(iv) ఉత్తమప్రవర్తనమునకు మంచి యవకాశ మేర్పడును. సంఘశక్తి, సౌహార్ద్రము, సౌభ్రాతృత్వము, కార్యదీక్ష, స్వార్థత్యాగము, దేశసేవ మున్నగు నుత్తమలక్షణము లలవడును.

(v) పరిపాలనాపద్ధతులను తెలుసుకొని, రాచకార్యతంత్ర మెట్లు జరుగుచున్నదో తెలిసికొందురు. ఈ జ్ఞానము వారి సుఖజీవనమున కెక్కువగ తోడ్పడును.

B. బోధించుట కవకాశము:—

(i) కుటుంబము, యజమాని - ఈ ధర్మముననుసరించి యొక పెద్దయు, నతని యధీనమున సురక్షితులగు వ్యక్తులును కలిసి సుఖజీవనము చేయుట మానవస్వభావమని తేటపరచవచ్చును. ప్రభువు భృత్యుడు అను న్యాయమును వివరించవచ్చును.

(ii) తరగతిబాలురు, ఉపాధ్యాయుడు - వీరి సంబంధమును బట్టి పరిపాలనావిధానమును తెలుపవచ్చును. ఉపాధ్యాయుడు లేనప్పుడు ప్రధానవిద్యార్థి (monitor) గ పని చేయుటను నిరూపించునది.

(iii) తరగతి విద్యార్థుల కన్యోన్యభావము ఆటలలోను, విద్యావ్యాసంగములందును కుదురుట యెట్లవసరమో, రాజ్యమందలి పౌరుల సుఖజీవనమునకు గూడ యీ పరస్పర సహాకార మవసరమని చూపించవచ్చును. సంఘర్షణములు కలిగినపుడు సౌఖ్యమునకు భంగము కలుగుటను తరగతి మాదిరిని నిరూపించవచ్చును

(iv) బాలురందరికి తరగతి గౌరవప్రతిష్ఠలను కాపాడుట యవసర మయినట్లు పౌరులందరికి పురగౌరవమును, రాష్ట్రగౌరవమును కాపాడుట యత్యవసరమని చూపించవలయును. వ్యక్తులు దీని నతిక్రమించినచో దండనబొందుట రెండు పక్షములందును సమానము.

(v) స్థానిక సంస్థలకు ప్రతిబింబములుగా తరగతి సంస్థల నేర్పఱచవచ్చును. వీనిలో వోటరులు, ఎన్నికలు పరిపాలనా విధానము, స్వార్థత్యాగము, సంఘశక్తి మొదలగు వానిని అభ్యసించుటకు మంచి యవకాశమున్నది.

(vi) చరిత్రకు సివిక్సుకు దగ్గరసంబంధము గలదు. పరిపాలన యంత్రములును, ఉద్యోగములును చరిత్ర చదివిననేగాని యర్థము కానేరవు. అట్లే తరగతి పరిపాలన యంత్ర

మనకు కూడ చిన్న చరిత్ర యేర్పరచుకొని పవిత్రభావము కలిగించుకొనవచ్చును.

### ప్రశ్నలు

1. 'పౌరధర్మములు' అనగా నేమి?
2. సివిక్సుబోధించు నుపాధ్యాయుని కేయుద్దేశము లుండవలయును?
3. సివిక్సుపాఠములు విద్యార్థుల ప్రవర్తన నెట్లు బాగుచేయగలవు?
4. ప్రాథమికపాఠశాలలలో సివిక్సుబోధన కెట్టియవకాశములుగలవు?
5. సివిక్సును ప్రత్యేకముగ నేల నేర్పగూడదు?
6. చరిత్రకును సివిక్సుకును గల దగ్గరసంబంధ మేమి?

---

## 2. ప్రాథమిక విద్యాప్రణాళికనుబట్టి అవసరములను గమనించుట

### 1–3 తరగతులు

(a) కుటుంబము, ధర్మములు, గ్రామము, వృత్తులు.

(b) మర్యాద లక్షణములు.

(c) శుచి — శుచికరములగు అభ్యాసములు — మనము శుచిగానుండుట - పరిసరములు శుచిగానుంచుకొనుట - శుచికరమగు దృష్టి యలవడుట.

(d) బాలుర యారోగ్యము - దీనిని పెంపొందించు క్రీడలు - సులభవ్యాయామము.

(e) అరుణధ్వజ సంఘములు–వాని పని – శుచి, సౌ కొల్పులకు, ఆర్తులకు సాయపడుటకు–మానవసేవ, దైవసేవ.

## నాల్గవ తరగతి

(a) మన యిల్లు – ఇరుగుపొరుగులు – మనధర్మములు – ఇంటను వెలుపలను శుచిగానుండుట – దానియవసరము.

(b) మన యారోగ్యము – ఆరోగ్యసూత్రములు – శుచికరములగు నాహారములు–అభ్యాసములు–గాలి, నీరు, అంటువ్యాధులు. వానివలన గలుగు ప్రమాదము–వానిని నివారించు నుపాయములు–ఆరోగ్యకరమగు నిత్యజీవనము– అందుకొఱకు మనము చేయు ప్రయత్నము.

(c) గ్రామము – నాడు నేడు గ్రామపరిపాలనము – గ్రామములు, పట్టణములు–వ్యాఖ్యానములు–గ్రామ సంస్థలు – వాని యుపయోగము

(d) మనరాజధాని – జిల్లాలు – జిల్లాపరిపాలనము – వివిధశాఖలు–ఉద్యోగులు–రాజధాని పరిపాలనము.

(e) నగరసీమలు–వాని సౌకర్యములు – పరిపాలనము– మ్యునిసిపలు సంస్థలు–స్థానిక సుంకములు – పన్నులు –జిల్లా బోర్డులు–వాని పరిపాలనము.

(f) పోస్టుకార్డు ప్రయాణము – రైల్వేప్రయాణము – ప్రాజెక్టు పద్ధతితో నిరూపించుట.

(g) చాటసూత్రములు - ప్రజలకు విద్యార్థులకును బోధించుట.

ఐదవ తరగతి

(a) మానవశరీరము-అవయవములు - వానిపనులు - ఆహారము జీర్ణమగుట.

(b) శరీరసంరక్షణము : మంచియలవాటులు - ఆరోగ్యము-నీతిప్రవర్తనము-మనయారోగ్యము, ప్రజల యారోగ్యము, వానికొఱకు మనప్రయత్నము.

(c) శరీర పోషణము : ఆహారము. నీరు, గాలి-ఆహార పదార్థముల విలువ-రోగములు వాని కారణములు-నివారణోపాయములు.

(d) దురభ్యాసములు : మత్తుపదార్థములు - పానీయములు-ఓషధులు-గంజాయి మొదలగునవి వానివలన గలుగు నష్టములు.

(e) ప్రభుత్వము : నిర్మాణము - బాధ్యతలు-మనకు గలుగు ప్రయోజనము-మన సహకారము.

(f) ఎన్నికలు : ముఖ్యసూత్రము-ఓటువిలువ-శాసన సభలు-వానిపనులు-ప్రజాప్రతినిధిసంస్థలు-అవి చేయుపనులు-మన సహకారము.

(g) మన బాధ్యతలు-హక్కులు-దైవభక్తి- దేశభక్తి-మనయైకమత్యము - నిమ్నజాతులు-వారిస్థితి - ఆదర్శప్రాయమగు ప్రవర్తనము.

## ప్రశ్నలు

1. ప్రాథమిక విద్యాప్రణాళికలో సివిక్సునకేమి ప్రాముఖ్యముగలదు?
2. మూడవతరగతివారికి బోధింపవలసిన యంశములేవి?
3. గ్రామము, నగరము - వీనికిగల భేదములేవి?
4. ప్రాజెక్టుపద్ధతి ననుసరించి పోస్టుకార్డు ప్రయాణము బోధించుము.
5. మన శరీరసంరక్షణమునకు తెలుసుకొనదగిన విషయములేవి?
6. మనబాధ్యతలు, హక్కులు - వీనిని బాలురెట్లు గ్రహించవలయును?

# 3. సివిక్సుబోధనకు సహాయకములు

(a) దృష్టాంతములు:— ఇవి (i) చిత్రములరూపముగ నుండవచ్చును. ఆదర్శప్రాయమగు భవనము, పాఠశాల, గ్రామము, ఎన్నికల వివరము, పోస్టాఫీసు, పోలీసుస్టేషన్ మొదలగు చిత్రములనుచూపి బోధించవచ్చును.

(ii) వాగ్రూపములు:— పూర్వకాలపు పంచాయితీలు, నేటివి - గ్రామపెద్దలు, వారిధర్మములు - పాఠశాల ఒక చిన్న ప్రభుత్వసంస్థ - సంఘసేవ - బాలభటోద్యమము మొదలగునవి వర్ణించి వివరించవచ్చును.

(b) ఈ క్రిందివాని నుపయోగించుటవలన బోధన రసవంతముగను బాలుర కాకర్షకముగను ఉండగలదు:

1 చిత్రపటములు:— గ్రామ పంచాయతి వృత్తాలు - శుచికరములగు అభ్యాసములు .. వ్యాయామవిధానము - అనేక ధ్వజ సంఘచిత్రములు మున్నగునవి తయారుచేసియు సంగ్రహించియు నుపయోగించుటది.

(2) చార్టులు:— ఆరోగ్యవిధులను మంచి యాహార మందలి భాగములను, అంటువ్యాధుల నాటంకపరచుట కుపాయములను, బాలసూత్రముల తెలియజేయు చార్టులను తయారుచేసి యుపయోగింపవచ్చును.

(3) మాదిరులు, ప్లానులు:— ఆరోగ్యపురము, ఎత్తు కల స్థలము, పోస్టాఫీసు, రెయిల్వేస్టేషను, ఆసుపత్రి, మ్యునిసిపలు ఆఫీసు మున్నగువాని మాదిరులు తయారుచేయవచ్చును. అట్టలతోను, సీసనున్నముతోను, బంకమట్టితోను తయారు చేయవచ్చును. చక్కని బాలలగల నగరము; ఆరోగ్య విధుల ననుసరించు నింటియొక్కయు, బడియింటియొక్కయు ప్లాను మొదలగునవి తయారు చేయునది.

(c) సంస్థలను దర్శించి వానివనిని గమనించుట:—

(1) పోస్టాఫీసు:— ఉత్తరముల బటువాడా, మని యార్డరు, రెజిస్ట్రేషను - సేవింగ్సుబ్యాంకి - వి. పి. పద్ధతి మొదలగువానిని గమనింపజేయుదగును.

(2) రెయిల్వేస్టేషను:— అచ్చటి యుద్యోగస్థులు-ప్లాటుఫారము - టిక్కెట్ల నమ్ముట - ప్రయాణీకుల సామానులు

తూచుట — రైళ్ళు రాకపోకలు — టపాలను, సామానులను, మనుష్యులను గొనిపోవుట.

(3) పంచాయతీకోర్టు:— అందలి ఉద్యోగులు - వారి పనులు - పన్నులవసూలు - వారుచేయు పనులు గ్రామమందలి నీటివసతి, రోడ్లు, దీపములు, పారిశుద్ధ్యము మొదలగు వానిని సరిచూచుట.

(4) పరపతిసంఘము:— ప్రతినిధులు - డైరెక్టరులు - వారు చేయుపనులు - ధనమెక్కడనుండివచ్చును. అప్పులిచ్చుట - డిపాజిట్లు పుచ్చుకొనుట — లాభము, పంపకము.

ఇట్లే పోలీసుస్టేషను, పంచాయతీకోర్టు మొదలగు సంస్థలను దర్శించి వానిలో జరుగుపనిని నిరూపించవచ్చును

## ప్రశ్నలు

1. సివిక్సు బోధించుటకు సహాయపడు విషయము లేవి?
2. దృష్టాంతము లెన్నివిధములు? అవి యెట్లుపయోగించును?
3. చార్టులను ఏయే విషయముల కెట్లు వ్రాసియుపయోగించవచ్చును?
4. సంస్థలను బాలురు దర్శించునప్పు డే విషయములను గమనింప వలయును?
5. ఏయేసంస్థలను గ్రామసీమలలో దర్శింపవచ్చును?

# 4. విద్యార్థులకు ఉపకారమైన నభ్యాసములు

1. ప్రాజెక్టులు:— ఈ పద్ధతిలో బాలుర జ్ఞానమును వివరించుటకు మంచి యవకాశములున్నవి. బాలురు ఆయా సంస్థలను దర్శించిన పిదప వానిని ప్రాజెక్టులుగా నిరూపించుట మంచి యభ్యాసము.

(a) పంచాయతీబోర్డు:— తరగతిలోని విద్యార్థులందరును ప్రజలు; కొన్ని భాగములు (wards) గ విభజించి ఒక్కొక్క భాగమునుండి యొకని నెన్నుకొనునట్లు చూడవలయును. ఈ ప్రతినిధులసంఖ్య అయిదుగాని ఎనిమిదిగాని యుండవచ్చును. వీరిలోనుండి యధ్యక్షుని నెన్నుకొందురు. పన్నులను వసూలుచేయు నధికారము కలదని నిరూపింతురు. గ్రామపారిశుద్ధ్యము, ఆరోగ్యము మొదలగువానిని గూర్చి జరుపవలసిన పనులు అనుభవమున చూపవచ్చును.

(b) పోస్టాఫీసు:— అందలి యుద్యోగులను విద్యార్థులలో నిర్ణయించి ఎవరుచేయవలసిన పనులు వారు చేయునట్లు చూడవలెను. కార్డులు, కవరులు అమ్ముట, మనియార్డరు, రెజిస్ట్రీపను మొదలగు పనులు చేయుట, ఉత్తరములను రవాణాచేయుట, వచ్చినవానిని బట్వాడాచేయుట మొదలగునవి ఆయా విద్యార్థుల చేతనే చేయించవలెను.

(c) ఎలెక్షను నాటకము:— ఓటరులు, ఓటునిచ్చుట, ఎలెక్షను కార్యాలయము, వోట్లను లెక్కించుట, జయాపజయములు నిర్ణయించుట, ఎలెక్షను విధానమును తరగతి విద్యార్థులచే జరిపించవచ్చును

2. విద్యార్థుల పరిపాలన:—

(a) తరగతి విద్యార్థులలో క్రమశిక్ష – ఉపాధ్యాయుని బాధ్యత–బాలురకు మంచి అభ్యాసము కలిగించుట – ప్రధాన విద్యార్థి (Monitor), అతని బాధ్యతలు – మిగిలిన విద్యార్థులతని యెడ ప్రవర్తింపవలసిన విధి. (b) క్రీడాసంఘములు నిర్మించుట – సంఘీభావము (Team Spirit) నాయకుడు – అతని బాధ్యతలు – అట్టి సంఘసూత్రములద్వారా పరిపాలనము. (c) వసతిగృహనిర్వాహణము– విద్యార్థుల సహకారము– వారి బాధ్యతలు – వారికిగల హక్కులు. ఈ మొదలగుకొన్ని విధానములు వారి యనుభవమునకు సమన్వయింపజేసి బోధించవలయును.

3 చిత్రించుట–మాదిరులు చేయుట: —

2 లోని (a) విభాగములో నుదహరించిన విధముగ చిత్రములను మాదిరులను తయారుచేయుటయందు మంచి యభ్యాసము కలిగించవలయును. ఈవిభాగమున జెప్పబడిన విషయములే గాక చిత్రించుటకనుకూలమగు విషయము లన్నియు నుపయోగించవలెను.

## ప్రశ్నలు

1. ప్రోజెక్టుపద్ధతిని సివిక్సులో నెట్లు ఉపయోగించవచ్చును ?
2. పంచాయితీ నిర్వహణమును ఈపద్ధతిలో నెట్లు చూపించవచ్చును?
3. ఎలెక్షను నాటకము ఆడించుటవలన లాభమేమి ?
4. విద్యార్థులకు పరిపాలనయందు పరిచయమెట్లు గలిగింతువు? అటు చేయుటచే గలుగు లాభము లేవి ?
5. చిత్రించుట, మాదిరులు చేయుట, ఈ స్వాధ్యాయమునకెట్లుతోడ్పడును?

---

# 5. ఉపాధ్యాయుని సిద్ధపడుట

(Teacher's Preparation)

మిగిలినపాఠములకు వలెనే సివిక్సు బోధించు నుపాధ్యాయుడుకూడ తగిన యర్హతను సంపాదించవలెను. ఈ విషయమున నభిరుచిని పెంపొందించుకొనుచు, తన జ్ఞానాభివృద్ధికొఱకు నిరంతరము కృషిచేయవలెను. ఉపాధ్యాయునికీ రెండు విషయములందును మంచి పరిచయమవసరము. ఈ పరిచయము చాలని యుపాధ్యాయుడు జయప్రదముగ బోధింపజాలడు.

### 1. మానవ సంఘాభివృద్ధియు, నందలి సంస్థలు:—

(a) మొదటిదశలో మనుష్యులు విడివిడిగా, కుటుంబములుగా నుండిరి. అప్పుడు స్థిరనివాసములు లేవు. ఒకచోటి నుండి వేరొకచోటికి సంచరించువారు; ఆదికాలపు ఆర్యులు,

(b) తరువాత గ్రామముల నేర్పరచుకొని, వృత్తులన్నియు నేర్పడునట్లుచేసి, గ్రామజీవనము సర్వాంగసౌష్ఠవముగ జేసికొనిరి. అప్పటికాలమున గ్రామనియమములు, వృత్తుల పరస్పరసామరస్యము నేర్పడెను. చతుర్వర్ణముల యేర్పాటుకూడ కలిగెను.

(c) సంఘము వృద్ధిఁబొందిన కొలది, రాజ్యము లేర్పడినవి. రాజధానులు, ప్రభువులు, సామంతరాజులు, ఆర్థిక వైభవము, సర్వతోముఖమగు అభివృద్ధియును కలిగినవి. ప్రభుభృత్య ధర్మములు రాజభక్తి మొదలగు నియమము లీకాలమున నేర్పడెను.

(d) రాజరికమున పరిపాలనములో ప్రజల సహాకారము, పన్నులనువిధించుట – వాని నియమములు – ప్రజోపయోగకరములగు శాశ్వతపు పనులు చేయించుట.

(e) ప్రజా ప్రతినిధుల పాలనము – వర్తమానకాలపు లక్షణము – దీని నియమములు – ప్రజలహక్కులు, బాధ్యతలు – దీనివలన సౌకర్యములు – ప్రజలు పొందవలసిన తరీఫీదు.

(f) క్రొత్త ప్రపంచపద్ధతి (The New world Order) – సామ్యవాదసిద్ధాంతములు – వాని యుపయోగములు – నష్టములు – ప్రపంచశాంతి సంస్థాపనము – నాగరిక ప్రభుత్వము లిందుకొఱకు కృషిచేయుట.

2. వివిధ పరిపాలనా విధానములు:—

A. (1) రాజరికము : పూర్వకాలము - నేడు - పూర్వపు రాజుల స్వేచ్ఛయును - ధర్మశాస్త్రాసక్తి - వర్ణాశ్రమ ధర్మములు కాపాడుట - 'నావిష్ణుః పృథివీపతిః' యను న్యాయమున ప్రభువులు ప్రజలకు గన్నతండ్రులవలె నుండెడివారు. కావున ప్రజలకు ప్రభువులవలన మితిలేని మేలు కలుగు చుండెను. నిరంకుశత్వము వలని కష్టములు.

(2) ప్రజాస్వామికములు - వీనియందు ప్రజలకు ప్రభువునందు గాక, రాష్ట్రమునందే, మితిలేని యభిమాన మేర్పడును. ప్రభుత్వవైఖరి యంతయు ప్రజా ప్రతినిధుల చేతుల యందుండును. శాసనసభకు ప్రధాని ముఖ్యుడు. అంతియే గాని చక్రవర్తి గొడవ లేదు. పరిపాలన మనుకూలముగ లేనపుడు ప్రజాప్రతినిధులే తమ సభలో చర్చించి యతనియందు నమ్మకము లేదని ఉపాదింతురు (Vote of No Confidence.) వెంటనే తిరిగి యెన్నికలు జరిపి బహుసంఖ్యాకులగు రాజకీయకక్షివారు ప్రభుత్వమును వహింతురు. ఫ్రాంసులో యిటువంటి ప్రభుత్వవిధానమే యున్నది; అమెరికా సంయుక్తరాష్ట్రములు.

(3) నియంతృరాజ్యములు - వీనియందు ప్రభువులకు అధికారమేమియు లేదు. కాని బహుసంఖ్యాక కక్షినుండియే పరిపాలకవర్గ మేర్పడును. ఈ కక్షివిశ్వాసమునకు పాత్రుడగు పెద్ద నియంతగా నేర్పడి, రాజ్యతంత్రము నడుపుచుండును. జర్మనీ, ఇటలీ మున్నగునవి - వీనియందు ప్రజలకు

క్షేమ మెంతకలదో, స్వేచ్ఛకు భంగముకూడ నంతవఱకు కలదు.

(4) ఫెడరలు విధానము స్వయం నిర్ణయసూత్రములపై నాధారపడి, స్వయంపోషకములుగనుండు ప్రభుత్వములు కొన్ని కలిసి, ఫెడరేషను సంస్థగా నేర్పడును. ఆయా ప్రభుత్వముల పరస్పర క్షేమలాభములును, విదేశరాజ్యములతో సంబంధములును, నిర్ణయించుటయే ఫెడరలు ప్రభుత్వ ధర్మములు-దీనియందు పాల్గొను రాష్ట్రములన్నియు సమాన ప్రతిపత్తి (Status) కలిగియుండును. మన కీ విధానమునే ప్రభుత్వమువారు నెలకొల్ప ప్రయత్నించిరి.

B. <u>బోధనకు నోట్సు</u>: సివిక్సు పాఠములలోని విషయములుచాలవఱకు ఊహించవలసినవికాని దృగ్గోచరములు కావు. అందుచే నుపాధ్యాయుడు బాలుర యనుభవమునకు సరిపడు విషయములను, చిత్రములను, పటాదులను సమకూర్చుకొని నోట్సు వ్రాయుచుండవలయును. తనబోధనను ఎక్కువ రసవంతముగ నుండునట్లు చూడవలయును; లేనిచో సివిక్సునందు తగినంత యాసక్తి కలుగనేరదు. పాఠ్యక్రమసూచికలు వ్రాయువిధానమును 'చరిత్రబోధన' క్రింద వివరముగ నిరూపించియున్నాము. దాని ననుసరించి వివరముగ నోట్సు వ్రాసుకొని బోధించుటకు ప్రయత్నించవలెను.

ప్రశ్నలు

1. సివిక్సు బోధించుటకు ఉపాధ్యాయు డేవిధముగ సిద్ధపడవలయును ?
2. మానవసంఘము క్రమముగ నెట్లభివృద్ధి నొందినదని నిరూపించవచ్చును.

3. క్రొత్త ప్రపంచపద్ధతి యేది? దీనికుండవలసిన సౌకర్యములేవి?

4. పరిపాలనా విధానము లెన్ని విధములు?

5. ప్రజాస్వామికములకు నియంతృత్వరాజ్యములకు గలభేదములను బాలురచే నెట్లు గ్రహింపజేయుదువు?

6. ఉపాధ్యాయుడు సివిక్సుపాఠమునకు వ్రాయునోట్సు ఎట్లుండవలయును.

...

## 6. ఉపాధ్యాయుని సిద్ధపఱచుకొనుట

( Equipment )

1. గ్రామసంస్థలు సర్వహింపబడు విధానమును స్వయముగ చూచి తెలుసుకొనిన విషయములను, పుస్తకములను చదివి గ్రహించిన వానిని వ్రాసుకొనిన చిన్న నోటుపుస్తకములను వీనిని సందర్భానుసారముగ పాఠప్రయోగమున నుపయోగించుట మంచిది.

2. అచ్చటచ్చటి పరిపాలనా విశేషములు, ఎన్నికల వివరములు, క్రొత్తయుద్యమములును, యితరుల యుపన్యాసములనుండి గ్రహించిన విజ్ఞప్తియుంచుకొనుటకు వ్రాయబడిన విడికాగితములు, వార్తాపత్రికలలో చదివిన విషయములు నట్లే యుపయోగించునది.

3. వెనుకపుటలలో నుదహరింపబడిన చిత్రములు, చిత్రలేఖనములు, మాదిరులు ప్రాతవస్తువులును సంగ్రహించి యుపయోగించుట మరియొకవిధము.

(a) సంస్థలను దర్శించి, నోట్సువ్రాయుటలో నభ్యాసము:— సివిక్సులో బోధించిన విషయములు స్వయముగ విద్యార్థులు తెలుసుకొనుటకు వీలుకలుగునట్లు వారిని ఆయా సంస్థలకును, స్థలములకును విహారములకు తీసికొనిపోవుట యుపాధ్యాయుని విధియనుకొంటిమి. ఏయేసంస్థల నెందు కొఱకు దర్శించవలయునో దర్శించినపుడు గ్రహించదగిన వివరము లేవో అవియెట్లు పొందుపఱపవలెనో ఉపాధ్యాయుడు నిర్ణయించుకొని విద్యార్థులకు సాయపడవలయును. ఇట్టి ప్రయత్నము జయప్రదముగ జరుగవలయుననినచో తరగతి విద్యార్థులసంఖ్య యధికముగ నుండరాదు. ఒకేవిహారమున నిప్పటికి పాఠవిషయములన్నియు గ్రహించునట్లుండవలయును. అచ్చటగూడ క్రమశిక్షను గమనించ వలయును. మరియు నెవ్వరుగాని క్రీడార్థమువచ్చినట్లు యోచించరాదు. ఊహించ దగిన విషయములనుగూర్చి విద్యార్థులకు ముందు పరిచయము కలిగించవలయును.

(b) పౌరసమూహమున నతడు తన ధర్మములను నిర్వహించవలెను:— ఉపాధ్యాయుడును పౌరధర్మములను పాటించవలసియున్నది. ప్రభుత్వమువలన శాంతి సౌఖ్యములను బొందుచున్నందుకు ప్రతిఫలముగ, ప్రభుత్వ నిర్వహణమునకు తోడ్పడునట్లు విధింపబడిన పన్నులు చెల్లించవలయును. మరియు న్యాయస్థానములకును, రక్షకభట శాఖకును తనసహాయ మవసరమగునపుడు (పంచాయతీదారుగ) విధ్యుక్తధర్మమును నెరవేర్చవలయును. ప్రజారోగ్యమునకు

భంగము కలుగు పనులేవియును చేయరాదు. అంటురోగముల నరికట్టుటకు ప్రభుత్వారోగ్యశాఖకు తోడ్పడవలయును. తాను వోటరగుటచే తన కనీసపుహక్కును సద్వినియోగము చేసి యర్హుల నెన్నుటకే వినియోగించవలయును. స్థానిక సంస్థలలో నెన్నికలకు నిలిచి గౌరవోద్యోగము లభించిన యెడల, తాను ప్రజాసేవకుడని నమ్మి యథాశక్తిగ సేవ చేయవలయును. స్వార్థపరత్వము విడువవలయును. తనగ్రామమునగాని రాష్ట్రమునగాని యితడాదర్శక పౌరుడను పేరు పొందవలయును. అట్లుచేసిన యుపాధ్యాయుడు సార్థకముగ బోధించగలడు. తానొకటిబోధించి వేరువిధముగ ప్రవర్తించినచో, నా యుపాధ్యాయుని మాటను వివేకముగలవారాదరింపరు. అతనియొద్ద విద్యనభ్యసించు విద్యార్థులకుగూడ చులకనయగును. ఈవిధముననుగూడ నుపాధ్యాయుడు తన ప్రవర్తనను సరిచేసుకొనవలసియున్నది.

## ప్రశ్నలు

1. సివిక్సుబోధించుటకు ఉపాధ్యాయుడెట్లు సిద్ధపడవలయును ?
2. వార్తాపత్రికలు, ఉపన్యాసములు - వీనినుండి యేయే విషయముల నుపాధ్యాయుడు గ్రహింపవచ్చును ?
3. గ్రామసంస్థలను దర్శించునపుడు ఉపాధ్యాయుడెట్లు తోడ్పడగలడు
4. పౌరసమూహమున నుపాధ్యాయుని కర్తవ్యమేమి ?
5. ఆదర్శకపౌరలక్షణములను బాలుర గ్రహించునట్లు ఏవిషయములు బోధింపవచ్చును ?

# బోధనా పద్ధతులు

## (భూగోళము)

---

## 1. ప్రాథమిక పాఠశాలలలో భూగోళమును బోధించుట కుద్దేశములు — అవకాశము

### A. ఉద్దేశములు

పూర్వకాలమందు భూగోళమును బోధించుటలో ముఖ్యవిషయములన్నియు తెలియజేయుటయే ముఖ్యోద్దేశముగ నుండెడిది. గ్రహించదగిన విషయములను వదున తప్పకుండ వల్లెవేయించి, యెట్లయినను బాలురు దృఢముగ వానిని నిలుపుకొనునట్లు చేయుటయే ముఖ్యాభిప్రాయము. ఆబోధన విద్యార్థుల కోమలములగు మానసముల కాయాసమును గొలుపుటయేగాక, భూగోళమున గలుగవలసిన యాశక్తిని కలిగింపజాలకుండెను. అందుచే బోధించు పద్ధతి మారవలసి వచ్చెను. భూగోళశాస్త్రమున తన ప్రకృతి పరిసరములను మానవు డెట్లతిక్రమించ గలుగునో, అందుకొఱకతని కృషి యెట్లు ఫలప్రదమగునో గ్రహించుట ముఖ్యము. ఇతర వివరములు సామాన్యములు. ఈ మానవ ప్రయత్నమును గుర్తెఱుగుటయం దాసక్తి కలిగించుట యుపాధ్యాయుని మొదటిపని. మరియు విశ్వమానవజీవితమునందు దృష్టి నిలు

చునట్లు చేయుట రెండవ యుద్దేశము. భూగోళశాస్త్రనియమములును, పరిస్థితులును, అన్ని ప్రదేశములకును అందరు ప్రజలకును అన్వయించి, తాము గ్రహించిన వివరము లెంతవఱకు సత్యములో గ్రహించుటయందు విద్యార్థుల కాసక్తి కలిగించుటకుపాధ్యాయుని కనుగొనవలయును.

నైసర్గిక పరిస్థితులు మానవజీవితము నెట్లునిర్ణయించునో గ్రహింపజేయదగును. జనులసంఖ్య, సుఖజీవనము, వానికాధారములు, అన్నియు నైసర్గిక పరిస్థితుల ననుసరించి యుండు ననియు, వానిని సులభముగ నిర్ణయించవచ్చుననియు, బాలుడు గ్రహించు విషయములలోనుండు కార్యకారణ సంబంధమును విద్యార్థు లన్వేషింపగలిగి యుండవలయును. ఈ జ్ఞానము యుగయుగాంతరములలో జీవించి భూగోళశాస్త్రమును ప్రతిష్ఠింపగలిగినది. విద్యార్థుల యనుభవమునందుండు విషయములతో సమానములగువానిని యితర ప్రదేశములలో గమనింపజేసి, విలక్షణములను కూడ గ్రహించునట్లు చేయుట కుపాధ్యాయుడూహించవలయును. ప్రకృతి మండరముగనుండు భూగోళమున, సమానత్వమున వ్యక్తిత్వ మిమిడియుండుట (Diversity in universality) ను గుర్తించునట్లు చూడవలయును. భూగోళము మనుష్యుని గూర్చిన విజ్ఞానమేయని తెలియనిచో గ్రహించిన వివరములన్నియు నిరర్థకములు; మనసునకు వినుగుగలిగి, యొక ప్రత్యేకపు తెన్ను తోచక, అంధకారప్రాయముగ నుండును.

## ౮ అవకాశము

1. మనుష్యుని కృషియందు దాగిన శక్తి పరిసరముల వశము నుండి వెలువలకి యుండుటచే, తన సుఖజీవనమునకవి తోడ్పడునట్లు చేసుకొనజాలును. పరిసరము లెట్లు మానవ జీవితమును నిర్ణయించునో, యతడు వాని నెంతవరకతిక్రమించి లాభము పొందునో విద్యార్థులు గ్రహింపవలయును.

2. తన యనుభవమునందలి నైసర్గిక పరిస్థితులు, శీతోష్ణములు, వాతావరణ పరిస్థితి, పంటలు, వృక్షములు మొదలగువానితో ప్రారంభించి, క్రమముగ తన దృష్టిని విశాలము చేయుచు, ప్రపంచపరిస్థితులను గమనింపవలయును.

3. పట్టణములు, అవి యేర్పడుట, వాని యభివృద్ధికి సాధనములు, వర్తక వ్యాపార కేంద్రములుగ వాని ప్రాముఖ్యము, పరిశ్రమల ఉనికికి ఎట్టివి కారణములో గమనించవలయును.

4. ప్రకృతి, మానవుడు — వీనికి సంబంధము చేయుట భూగోళమువని. అన్యోన్యసహాయమున మానవు డుత్కృష్టుడగుటయు, ప్రకృతి ప్రభావ మధికమై యొక్కువగ తోడ్పడుటయు, విద్యార్థులు క్రమముగ గ్రహింపవలయును.

5. మానవుడు ప్రకృతి నతిక్రమించుచు తనవశమున నుండుకొనుట కెట్లు ప్రయత్నించునో ఆ ప్రయత్నము లెంతవరకు ఫలవంతములగుచున్నవో అధిక ఫలములు గలుగకుండుట కేమి ప్రతిబంధకములు గలవో, స్పష్టముగ తెలుసు

కొనునట్లు చేయుట భూగోళమునవి. వీని ననుసరించి భూగోళ పాఠప్రణాళిక నేర్పఱచుకొనుట యుక్తమగును.

౨. ఇతర పాఠములతో సంబంధము

1. ప్రకృతిశాస్త్రమునకును భూగోళమునకును దగ్గర సంబంధము గలదు. అగ్నిపర్వతములు, వివిధములగు శిలలు, అడవులు, పర్వతములు మొదలగునవి ప్రకృతిశాస్త్రమునకు జెందినవి. మానవుని ప్రయత్నమునకివి తోడ్పడు నంతవఱకు భూగోళపాఠమున తెలుసుకొనవలయును.

2. విజ్ఞానశాస్త్రములతో గూడ దగ్గర సంబంధమున్నది. నీరు ఆవిరియగుట, వేడిమివలన పదార్థములు వ్యాకోచము నొందుట, చల్లనిప్రదేశములకు తగిలినపుడు తడిగాలులు వర్షించుట, తడిగాలులు, పొడిగాలులు మొదలగునవి విజ్ఞానశాస్త్ర విషయములు. మానవునికృషికివి యెంతవరకు సహాయపడుచున్నవో భూగోళమున తెలుసుకొనవలెను.

3. చరిత్రకు భూగోళమునకును గల సంబంధము బలవత్తరము. హిందూదేశపు చరిత్రను చక్కగ అర్థము చేసుకొనుటకు భూగోళజ్ఞానము చాలముఖ్యము. దేశచరిత్రను చదువుటవలననే భూగోళవిషయములు (ఆర్థిక: రాజకీయములు) సులభముగ గ్రహింపనగును.

4. చిత్రలేఖనము భూగోళమును బోధించు నుపాధ్యాయుని కెక్కువగా తోడ్పడును. భూగోళపాఠములందలి

విషయములు విద్యార్థులు స్వయముగ పరిశీలించి తెలిసికొనవలయును. లేనిచో వారి జ్ఞానము దృఢముగ నుండ నేరదు. అన్నిటికిని మానచిత్రములు చూపించుట కష్టము. విహారములలో స్వయముగ గుర్తింపజేయుట దుస్తరము. చిత్రలేఖనమున కొంత ప్రజ్ఞగల యుపాధ్యాయు డాయా వివరములను బొమ్మలుగా వేసి చూపించుటకు అవకాశ ముండును.

### ప్రశ్నలు

1. భూగోళమును బోధించుటలో యుపాధ్యాయుని యుద్దేశములను వివరింపుము.
2. భూగోళపాఠములలో నేయేవిషయములు బోధింపవచ్చును?
3. ఏయితర పాఠములకు దీనితో సంబంధముగలదు? అదియెట్లు?

---

# 2. స్థానిక భూగోళము

## 1. పరిసరములు అనగా నేమి?

భూగోళపాఠమును బోధించుటకు విద్యార్థుల కెక్కువ పరిచయముగల యిల్లు, బడి, గ్రామమును ఆధారముచేసుకొని ప్రారంభించవలయును. ఎక్కడనో యున్నవియు, అర్థము చేసుకొనుట దుస్తరమైనట్టియు భూసంధి, జలసంధి, వేడినీటి ప్రవాహము మున్నగు విషయములతో ప్రారంభము చేయరాదు. అందుచే విద్యార్థులును ఉపాధ్యాయుడును నివసించు

స్థలమున భూగోళపాఠములను బోధించుట ప్రారంభము సేయ వలయును. ఆ శాస్త్రము గూర్చిన వివరములన్నియు సంగ్రహింపబడుటచే సిద్ధాంతము స్థానిక భూగోళ మాతృకను చెందినది. మనము నివసించు గ్రామమును, తర్వాత తాలూకాను, పిదప జిల్లాను, రాష్ట్రమును, దేశమును కడపట ప్రపంచమును గూర్చి క్రమముగ చెప్పుకొనుట మంచిపద్ధతి.

## 2. ఉపాధ్యాయుని ప్రయత్నము

సాధారణముగ సులభముగ గ్రహింపదగిన యంశములను బాలురు స్వయముగ చూచుట కవకాశము లేర్పఱచ వలయును. తరగతి విద్యార్థుల సామర్థ్యములను దర్శించుట కుపాధ్యాయుడు తీసికొని పోవుట చాల యవసరము. ఇందు కొఱకు ఈ క్రిందివిధముల సిద్ధపడవలయును.

1. విహారములకు పూర్వము ఉపాధ్యాయుడు దర్శించ వలసిన విషయములను గూర్చియు వారచ్చట తెలుసుకొన దగిన యంశములను గూర్చియు తరగతిలో ముచ్చటించ వలయును.

2. తరగతిలో బాలుర సంఖ్య 20 మాత్రముండ వచ్చును. అంతకంటె నధిక సంఖ్యయైనచో ప్రతియొక విద్యార్థి చేయుపనిని గమనించుట కవకాశము చాలదు. పెద్ద తరగతి యైనచో రెండు భాగములుచేసి రెండుసారులుగాని, ఇద్దరు ఉపాధ్యాయులొకేసారిగాని తీసికొని వెళ్ళవచ్చును.

3. సాధ్యమగునంతవఱకు వారి స్వేచ్ఛ కవకాశ ముండవలయును. అందరును గమనింపదగిన ముఖ్యవిషయము

లోకటిరెండు సార్లు నుండినచో విద్యార్థులందరిని సమావేశ పఱచి, సంగ్రహముగ ముచ్చటింపదగును.

4. ప్రకృతియే వారికుపాధ్యాయుడు కావలయును. విద్యావిషయిక ప్రాముఖ్యముగల వస్తువులను కొలదిగా సంగ్రహించుట మంచిది. అందువలన వారి యాసక్తి వృద్ధి యగును.

5. పూర్తియయినపిదప విహారమున చేర్చిన సంగతులు వివరించుకొని, సంగ్రహముగ వ్రాసుకొని జ్ఞానమును వృద్ధిచేసుకొనవలయును.

## — 3. గమనింపదగిన విషయములు. —

1. దిక్కులను గుర్తించుట: —




(a) వరుసగా రెండుమూడు దినములలో సూర్యుని ఉదయము, మధ్యస్థితి, అస్తమయము గుర్తించునట్లు చేయు

నది. సూర్యుడు ఉదయించుదిక్కు తూర్పు అనియు, దాని కెదురుగా నిలిచినపుడు కుడిచేతివైపు దక్షిణము, ఎడమచేతి వైపు ఉత్తరము, వెనకభాగము వైపు పడమర అనియు గ్రహింపచేయునది.



(b) దిక్సూచియంత్రము, దాని యుపయోగము : దీనిని చూపించి యుత్తరమును కనిపెట్టునట్లు చేయవలయును. అనేక విధములుగ మార్చినను కొంత సంచలనము కలిగి లోపలిముల్లు ఉత్తరమును సూచించి నిలుచుటను గమనింప జేయునది. దీనినిబట్టి మబ్బుదినములందును చీకటియందును కూడ దిక్కులను సులభముగ నిర్ణయించవచ్చును. నావికుని దిక్సూచియంత్రమునుకూడ చూపించి బోధించవసగును.

(c) రాత్రిభాగమున నక్షత్రముల సంచారమునుబట్టి దిక్కులను నిర్ణయించవచ్చును. తెలుగు పంచాంగము ననుసరించి యేసమయమున నే నక్షత్రమును ఎచ్చట చూడ

వలయునో నిర్ణయించుకొనవచ్చును. రాత్రులందు కాలమును కొలుచుటకిది దేశీయమగు పద్ధతి.




(4) గాలికోడి: దీని చిత్రమును చూపి దిక్కులెట్లు సూచింపబడునో వివరించవలయును. మీ పాఠశాల భవనముపైగాని యావరణముపైగాని దీనిని ప్రతిష్ఠించుట చాల యుపయోగకరము. ఈ వివరణమునుబట్టి నాలుగు దిక్కులను, నాలుగు మూలలను గమనింపజేయవచ్చును. మన

పురాణములలో ఎనిమిది దిక్కులకును దేవత లధిపతులు కలరని చెప్పబడియున్నది. ఏ దిక్కున కెవ్వరధిపతియో వివరించవలెను. ఎనిమిది దిక్కులను, వాని యధిపతులను తెలుపు పటమును తయారుచేయించునది.

ఈ ప్రయోగము ననుసరించి బడిగదిలో దిక్కులను నిరూపించవలయును. వానిని తెలుపుఅట్టముక్కల నాయా గోడలకు తగిలించవలయును; లేదా, రంగు సీమసున్నముతో గుర్తించుట మంచిది. దిక్సూచియంత్రమును తెచ్చి బాలుర జ్ఞానమును రుజూవుచేయవలయును. ఏదిక్కున నేవస్తువులు కలవో వర్ణించి జ్ఞాపకమును నుంచవలయును. తూర్పుదిక్కును బట్టి మిగిలినవి చెప్పించుట మంచిది. అభ్యాసము కొఱకు నాలుగు దిక్కులకు మొగము త్రిప్పి, ఏవైపున కే దిక్కు కలదో చెప్పించుటవసరము

బడిగదికి వర్తించిన విషయములను బడి యింటికిని ఆవరణకును వర్తింపజేయుట మంచి అభ్యాసము. అందువలన బాలుర జ్ఞానము దృఢపడును. తనయింటి కేదిక్కున నేమి కలదో, తాను చదువుగదిలో నేమేమి యేదిక్కున నున్నవో గుర్తింపజేసి వ్రాయించుట కాని, చెప్పించుట కానిలాభకరము.

## — 4. వాతావరణముల స్థితిని గమనించుట —

కాలమంతయు నొకేతీరుగ నుండదు కొన్నిరోజులలో చల్లనిగాలులు వీచును. కొన్నిరోజులలో వర్షపుగాలులు వీచి, చినుకులు పడును. మరియొకప్పుడు జోరుగ వర్షించును. ఒకప్పుడు మబ్బుపట్టి ముసురుగాలి వీచును. ఒకసంవత్సర

ములో తేదీవారిగ వివరములు బాలురు తమ డైరీలలో గుర్తించిన యెడల ఏయే కాలములలో వర్షములు పడునో, చలిగాలులు వీచునో, మబ్బులు పట్టునో, స్వచ్ఛముగ సూర్యకాంతి కనబడునో గమనించుటకు వీలు కలుగును.

నోటుబుక్కులలో నెలకు ముప్పదిదినములకు గడు లేర్పరచి ప్రతియుదయము బడివేళలో నిక్రింది విషయములు బాలురచే గమనింపజేసి గుర్తింపవలెను. మాదిరి ఈ క్రింద చూపబడియున్నది. (1) గాలియేదిక్కునుండి వీచుచున్నది ? (2) మబ్బుపట్టియున్నదా ? (3) వర్షము కురియుచున్నదా ? లేక చినుకులు మాత్రము పడుచున్నవా ? (4) వేడిమి యెంత అధికముగ నున్నది ? (5) ఎంత తక్కువగ నున్నది? ఈప్రశ్నలకు సమాధానములు ప్రతివిద్యార్థి స్వయముగ వ్రాసుకొనవలయును. బడియందును యీ వివరములు గుర్తించిన చార్టు లుంచుట మంచిది.

వాతావరణములచార్టు – 1940 సం – అక్టోబరు నెల

| తేదీ | గాలిస్వభావము | మేఘములు | ఎండ | వాన | ఉష్ణోగ్రత | |
|---|---|---|---|---|---|---|
| | | | | | అధికము | తక్కువ |
| 9 | పొడిగాలి : ఈశాన్యమునుండి | లేవు | బాగు | .0 | 86 | 74 |
| 10 | తడిగాలి : డిటో | కొలదిగ నున్నవి | స్పష్టముగ లేదు | .2 | 87 | 73 |
| 11 | డిటో | డిటో | డిటో | .2 | 85 | 76 |
| 12 | డిటో | డిటో | లేదు | .3 | 88 | 77 |
| 13 | డిటో | డిటో | స్పష్టముగ లేదు | .2 | 86 | 77 |

వేడిమిని, చెమ్మను డిగ్రీలలో కొలుచుటకు పనికివచ్చు (Thermometer). లు గలవు. వానిని తెచ్చికొలతలు బాలురచే గుర్తింపజేయవలయును. గాలి ఒత్తిడిని తెలియజేయునది (Barometer). దాని యుపయోగమును వర్ణించునది. గళ్లకాగితములలో నీ యుష్ణోగ్రతను, తడిని సూచించు రేఖలు (రేఖ్యములు) గీయించి చూపి, వానిని చదువుట నేర్పునది. కురిసిన వర్షమును వర్షమానినితో కొలిపించి గుర్తించునది.

రోజువారి రికార్డు తయారుచేసిన తరువాత, వీనినిబట్టి సంవత్సరమున నేయే నెలలలో వర్షములు జోరుగాపడునో, ఎప్పుడు చలిగాలులు వీచునో, ఎప్పుడు చక్కని యెండదినములు కలుగునో, మబ్బులు పట్టి ముసురుగాలు లెప్పుడు వీచునో, ఏదినములలో నుష్ణోగ్రతయు చెమ్మయు నెట్లుండునో గమనింపజేయవలయును. ఇట్లలవరచిన జ్ఞానము దృఢముగ నిలుచును.

## ప్రశ్నలు

1. స్థానికభూగోళమనగా నేమి ?
2. ఉపాధ్యాయుడీ విషయమున జేయదగిన ప్రయత్నమేమి ?
3. దిక్కులను తెలుసుకొనుట, నిర్ణయించుట యెట్లు ?
4. వాతావరణముల చార్టుల నెట్లు తయారుచేయవచ్చును ? ఇవి యెట్లుపయోగపడును ?

# ౩. స్థానికభూగోళము—నైసర్గికస్థితులు

## కొండలు - లోయలు

ఒడికి సమీపమున వీనిని బాలురు స్వయముగ దర్శించుటకు వీలు కలిగినచో చాలమంచిది. ఉపాధ్యాయుడు బాలురకివి యెట్లేర్పడునో, కొండలకడుగు లోయ లేలయుండవలయునో, కొండలమీదచేయు వ్యవసాయ మెట్టిదో, అందు దొరకు చెట్టుచేమలు ఓషధులు మన కెట్లుపయోగించునో బోధించవచ్చును. వీనిని చిత్రించుట మంచిది. బంకమట్టి యిసుకతోను వీని యాకృతులను తయారుచేయించవచ్చును. చిన్నకొయ్యతొట్టె ప్రతియొక విద్యార్థికి నిచ్చి, వానిచే స్వయముగ నీయాకృతి చేయించవచ్చును; లేదా, బడియావరణమున మట్టితోనే వేయించవచ్చును. సీమసున్నము, జిగురు కలిపి తయారుచేయుట కూడ మంచిపద్ధతి. కొండ క్రిందను పైనను Barometer ను చదవించి వాయుభారమును కని పెట్టునట్లు చేయవచ్చును.

## నీటిపారుదల - నీటివసతి

సమీపమున ప్రవహించు నదులయొద్దకు తీసికొనిపోయి వాని పారుదలను గమనింపజేయవలయును. (1) ప్రవాహము నదియొడ్డులదగ్గర తక్కువగను మధ్యభాగమున నధికముగను కనబడును. దీనికి కారణములేమి? (2) వర్షాకాలమున నదుల స్థితికిని, వేసవికాలమున నదుల స్థితికిని భేదము లేవి? వర్షాకాలమున నీరు ఎఱ్ఱగానుండి బురదతో కలిసియుండును.

ఒక గ్లాసులో యీనీరు నిలువయుంచినచో, అందున్న మన్ను అడుగునకు దిగి, స్వచ్ఛమగు నీరు తేరును. చలికాలమున నీరు నల్లబడుటను గమనించవలెను. (౫) ప్రవాహముతో




మన్ను కొట్టుకొనివచ్చుటయు, ఒడ్డులవద్ద తక్కువగానుండు చోట నీ మన్ను నిలుచుచుండుటయు, సముద్రమున గలియు చోట ప్రవాహము వడితగ్గుటచే నీ మన్ను క్రిందికి దిగి, క్రమముగ లంక (Delta) లేర్పడుటయు గ్రహింపజేయ వచ్చును. వీనిని గమనించుటకు విద్యార్థులను వర్షము కురిసిన తరువాత షికారుగా తీసికొనివెళ్ళుటమంచిది. ఈ క్రింది విషయములన్నియు వారే స్వయముగ గ్రహింతురు. (౧) నీరు ఎత్తునుండి పల్లమునకు ప్రవహించును. (౨) మెత్తని ప్రదేశ

మూలను కరిగదీసి కొంతమన్ను కొట్టుకొనిపోవును. (౫) గట్టి ప్రదేశములు నీటి తాకుడులను తట్టుకొని నిలుచుండును. అందుచే ములికలుగ నీరు ప్రవహించును. (౬) మరియు చుట్టుప్రక్కల నుండి ప్రవహించు నీరు ముఖద్వారానికి కలియును. అప్పుడు ఆ ప్రవాహమునీరు ఎక్కువయగును. ఇట్లు కలిసినవి ఉపనదుల వంటివి. ఈ జ్ఞానమును నాలుగులుగ తయారుచేసి నిరూపించవచ్చును. బంకమట్టిని, ఇసుకను కలిపిన గట్టి యందు - నీరు పోయుచుండినచో ఇసుక కొట్టుకొనిపోవును. గట్టిభాగములు నిలిచి వాని మధ్యనుండి నీరు ప్రవహించును అని నిరూపించునది.

## నీటి వసతి

1. అన్ని ప్రాణులకు నీరు జీవనాధారము కనుక నీటి వసతి ముఖ్యము. నదీప్రవాహముల కిరుపార్శ్వములను జనసంఖ్య యధికము. పట్టణము లెక్కువగనుండును. నీటివసతి తక్కువగల ప్రదేశములలో జనసంఖ్య తక్కువ. పట్టణము లెక్కువగానుండవు. కారణము లేవి ?

2. వ్యవసాయమునకు చాల యుపయోగము. నదుల నుండి కాలువలు తీసి నీరు ఉపయోగింతురు. ఎత్తుప్రదేశములకు ప్రవహించవలయునని నీటిమట్టము అధికము కావలయును. అందుకొరకు నదులకు ఆనకట్టలు కట్టుదురు. కాలువలయల్లిక లేర్పరచి, చాలభాగములకు పంపుటచే నవి ఫలవంతములగును.



3. నదుల వసతి లేనిచోటులలో పెద్దచెఱువులే నీటి యాధారములు. ఇవి వ్యవసాయమునకు ఉపయోగించును.

ప్రజలకు స్నానపానముల కుపయోగించును.

4. నదులు లేనిచోటులలో నూతులు, దిగుడుబావులు ఏర్పఱచి యుపయోగింతురు.

5. పాతాళగంగ గొట్టములు: పై విషయములని సాధ్యమగునంతవఱకు విద్యార్థులు స్వయముగ గమనించుట మంచిది.

పంటలు:— స్థానికములగు పంటలను బాలురు స్వయముగచూచి తెలుసుకొనవలయును. మన దేశమున పల్లపు ప్రదేశములలో వరి ముఖ్యమగుపంట. దీని చరిత్ర సంగ్రహముగ గ్రహింపజేయవలయును. వ్యవసాయదారుల పరిశ్రమను కన్నులార చూచినచో బోధపడును. దీనికి నీరు, వేడిమి ఎక్కువగావలయును. (i) ధాన్యమురకము లెట్లుతయారగునో తెలుపవలయును (ii) పప్పుదినుసులు — ఇవి పైరగు విధములు, (iii) కాయగూరలు, చిన్నతోటలు, పండ్లదినుసులు, (iv) భూగర్భమున తయారగు కంద, చిరుగడదుంప, చేమ, పెండలము. అల్లము మొదలగునవి. (v) లతలుగా ప్రాకికాయు చిక్కుడు, బీర, పొట్ల మొదలగునవి. (vi) ఎక్కువజాగ్రత్తతో పండించు విజాతీయములగు కూరలు, పండ్లు మొదలగునవి. పంటలు పండించి జీవయాత్రను గడపుట చాలమందికివృత్తి. ఆయాప్రాంతములలోగల పంటలజాబితా తయారుచేయించి, యవి పండుటకుకావలసిన నీరు, శీతోష్ణములు, భూసారము తెలిసికొనునట్లు చేయవలెను.

## ప్రశ్నలు

1. నైసర్గిక పరిస్థితుల క్రింద విద్యార్థులు స్థానిక భూగోళజ్ఞానమునకై ఏమేమి పరిశీలించి చూడవలయును ?
2. నీటివసతి యనుకూలముగ లేనిచోటులలో నీటివసతి యెట్లు కలుగు చున్నది ?
3. పంటలకు కావలసిన ముఖ్యపరిస్థితులేవి ? మీ ప్రాంతమందలి ముఖ్య పంటలను చెప్పుము.

---

# 4. స్థానిక భూగోళము - ప్రజలజీవితము

వృత్తులు-జీవనమున కుపాయములు:— ఒక గ్రామమందన్ని వృత్తులు నుండినచో సౌఖ్యకరముగ నుండుటను చూపించునది. పూర్వకాలపు గ్రామము లిట్లాదర్శప్రాయములుగ నుండెను. ఇప్పుడు వృత్తులు నశించియుండుటచే పరాధారమగు జీవనము లేర్పడినవి. మనము ఉపయోగించు వస్తువులలో నేవి మన ప్రాంతములలో తయారగునో, యేవి దూరమునుండి వచ్చునో గుర్తింపజేయవలెను.

నైసర్గిక పరిస్థితులపై నాధారపడియుండును; ఎట్లు?:—

1. వ్యవసాయమున కనుకూలములగు స్థితులు:— కొండప్రదేశములలోను, ఎడారులలోను, చవుటిపఱ్ఱలలోను దీని కవకాశములు లేవు. అనుకూలమగు నీటివసతి, సారవంతములగు నేలలు చక్కని శీతోష్ణస్థితులు ఉండినచోటులు అనుకూలములయినవి.

2. <u>చేతిపనులు</u>:— పూర్వకాలపు గ్రామము లన్ని వృత్తులు కలిగి సర్వసమృద్ధములుగ నుండెడివి. కమ్మరిపని, కుమ్మరిపని, నేతపని, రంగులుచేయుట, బట్టలకురంగు వేయుట, బంగారము, వెండి, దంతము మొదలగు విలువ యగు పనులు, నగిషీపనులు - ఇవియన్నియు జనులు సుఖ జీవనము చేయు సాధనములు. ఇటీవలి కాలమున యంత్రములు అందరికీ అందుబాటులో నుండుటచే వీటికి ప్రాముఖ్యము తగ్గినది.

3. <u>యంత్రాలయములు - కర్మాగారములు</u>:— వీని ద్వారా పనిచేయించి జీవించుటకు పెట్టుబడిధనము విశేష ముగ అవసరము. ఒకరే నిర్వహించదగిన పనులుగావు. అందుచే ధనవంతులగు షావుకారులు ముగ్గురు నలుగురు కూడి పెట్టుబడియుంచి వీనిని నడుపుచుందురు. వీనియందు కూలిపనిచేసియు యంత్రములకు సంబంధించిన యుద్యోగ ములను చేసియు చాలమంది జీవింతురు. వీనిలో తయారు చేయు వస్తువులకు తగిన మార్కెటు అందు బాటులో నుండవలయును. మరియు అచ్చటికి రాకపోకల సాధనములు గూడ అనుకూలముగ నుండవలయును.

4. <u>చేపలుపట్టుట, ఓడలు కట్టుట</u>:— ఇవి సముద్ర ప్రాంతములందలి జనులకు సాధారణములగు ముఖ్యవృత్తులు. ఇంతకంటె యితరవృత్తుల కిచ్చటి నేల యనుకూలముగ

నుండదు. ఈ వృత్తులు సముద్రమునకు సమీపదూరములలో నున్న ప్రదేశములలో సులభసాధ్యములుగాను.

5. గొఱ్ఱెలను, పశువులను పెంచుట:... ఇది పెంపుడు జంతువులగుటచే ప్రతిగ్రామమునందును కొంతవరకిమాత్రమిది వృత్తి. కాని పచ్చికబీడులు విస్తారముగగల ప్రదేశములలో జనులకిదియే ముఖ్యవృత్తి. దీనివలన వర్తకమునుగూడ సాగింతురు. పాలు, వెన్న, మాంసము, ఉన్ని, కొమ్ములు-వీనితో మంచి వర్తకము చేయుట కవకాశము లున్నవి.

బడులలో చదువుకొని, చేతితో పనిచేయక, కేవలము కలముత్రిప్పుచు జీవించువార లసంఖ్యాకు లున్నారు; ఉపాధ్యాయులు, గుమాస్తాలు, గవర్నమెంటు ఉద్యోగులు, గ్రామ ఉద్యోగులు, వకీళ్లు, డాక్టరులు మున్నగువారు. దేశ మండలి వస్తుసంపదను వృద్ధిచేయుట కీ వృత్తులు తోడ్పడవు. కాని దేశసౌభాగ్యము వృద్ధిబొందుట కుపయోగించును. దీని ననుసరింపదలచినవారే చాలమంది యుందురు. కనుక నిరుద్యోగసమస్య తీవ్ర మగుచున్నది.

## రాకపోకలసాధనములు - ప్రయాణసౌకర్యములు

1. నేలమీద కాలిబాటలో నడచిపోవునది మొదటిది. ఇది చాల యసౌఖ్యకరమయినది. ఘాతుకమృగములు,

దొంగలు, జాడ్యములు మొదలగువానికి లోనయినవి. దీని వలన వర్తకవ్యాపారములు అరికట్టబడును. వృద్ధిపొందనేరవు. రోడ్లు మనదేశమున చాల భాగముల కిటీవలనే యేర్పడినవి. ఇవిలేని ప్రదేశములు యింకను గలవు; వీనిని చేయుట ప్రయాసకరము. మరమ్మతులు చేయుచు మంచిస్థితిలో నుంచుటయు దుర్వ్యసాధ్యము — బండ్లమీద సరఫరాజరుగుట కివి చాలవఱకు ఉపయోగించును.

రైలు మనదేశమున నూరేండ్లలోపలి విషయమే. ఎంతదూరమయినను తక్కువకాలములో చౌకగాను సౌఖ్యముగాను ప్రయాణము జరుపుటకుమంచిసాధనము. దీనివలననే వర్తక మిప్పుడుబాహుళ్యము నొందినది. ఈమార్గమున నష్టములుగాని, ప్రమాదములుగాని యెంతగా కనబడవు.

మోటారు రైలుతో పోటీచేయుచున్నది. నిమ్నోన్నతము లధికముగ నుండి రైలువేయుటకు వీలుపడని ఏజెన్సీ భాగములలో గూడ మోటారు లధికముగ తిరుగుచు మనుష్యులను, సరకులను రవానాచేయుచున్నవి. దీనికి అంతరాయములు కలుగుట కవకాశములున్నవి.

2. నీటిమీద ప్రయాణము, చౌక. సముద్రములందును పెద్ద నదులలోను పొగయోడలు తిరుగును. ఇవి

తొందరగాను, చౌకగాను నిశ్చయముగాను రవానా చేయును. మామూలునదులలోను పెద్దకాలువలలోను రవాణాదారిపడవలు, నావలు తిరుగుచు వర్తకమును నడుపును. ఈ సాధనము చాల చౌకయయినది. కాని కాలహరణము మితిమీరి యుండును.

3. గాలిలో విమానములు సాధనములు. శాస్త్రపరిశోధనల ఫలితముగ నివి యేర్పడిన నిర్మాణములు. మనుష్యులతిత్వరితముగా వెళ్ళుటకును, తేలికగల వస్తువులు పంపుటకును ఉపయోగించును. టపాలు విమానముల ద్వారా పంపబడుచున్నవి. ప్రస్తుతము జరుగుచున్న యుద్ధమున విమానములకు చాల ప్రాముఖ్య మేర్పడినది. వేళనియమమును, సరిహద్దుల నియమమును లేక యథేచ్ఛగా నివి సంచరింపగలవు. వర్తకమున కివి యెక్కువగా తోడ్పడజాలవు గాని శీఘ్రకాలమున మనుష్యులను టపాలను గొని పోగలవు.

వరా:— (1) పై విషయములను స్వయముగ గ్రహించినపుడు విద్యార్థులు వాని కనుకూలములగు పటములను వ్రాయుచు చిత్రములను చిత్రించియు, అపురూపములగు వస్తువులను సంగ్రహించియు తమ జ్ఞానమును దృఢపరచుకొనవలయును.

(2) ఈశీర్షిక క్రింద తెలుపబడినవన్నియు అన్ని స్థలములలోను చూచి తెలుసుకొనుటకు వీలు కలుగునని తలచకూడదు. ఆయా ప్రదేశములలో నేవేవి చూచుటకవకాశమున్నదో ఉపాధ్యాయులు ముందుగా

నిర్ణయించవలెను. వానిని గమనించునట్లు ఉపాధ్యాయులు విద్యార్థులకు సలహాలనిచ్చుచుండ వలయును.

(3) ట్రెయినింగులోని విద్యార్థులు స్థానిక భూగోళ విషయములను పైవిధముగ గుర్తించుచు ఉపాధ్యాయుల పర్యాలోచన క్రింద చిన్న చరిత్రలు తయారుచేయవచ్చును. రెండు సంవత్సరములకు మధ్యనుండు సెలవుల కాలమున ప్రతి విద్యార్థియు తన ప్రాంతమును గూర్చి పై వివరములను సంగ్రహించుకొనివచ్చి, బడి తెరువగనే యుపాధ్యాయుల కందజేయవలయును. ఒక్కొక్క స్థానిక చరిత్రను ఉపాధ్యాయులు, విద్యార్థులను విమర్శించి, తయారుచేయుటలోగల గుణదోషములను నిర్ణయించి, తగిన సలహాలనిచ్చి వానిని ఆదర్శప్రాయములుగ తయారు చేయించవలయును. పాఠశాలలో నివి యన్నియు సంగ్రహించి నచో ముందుసంవత్సరములలో జరుగుపని కివి చాల వఱకు మార్గదర్శకములుగ నుండగలవు.

(4) విద్యార్థులు తయారుచేయగలిగిన పటములను, చిత్రములను, మాడళ్లను అచ్చటచ్చట గుర్తింపబడియున్నవి. ఇవియేకాక ఇతరములను వ్రాయుచు చిత్రవిచిత్ర వస్తువులను సంగ్రహించుచు విద్యార్థులు మంచి Museum తయారుచేయుట చాల యుపయోగకరము.

## ప్రశ్నలు

1. వృత్తులనగా నేమి? అవి దేనిపై నాధారపడియుండును?
2. రాకపోకలకు ముఖ్యసాధనము లేవి? ఏది ఎట్లు ఉపయోగించును?
3. తాము గ్రహించిన వివరములను విద్యార్థులెట్లు దృఢపఱచుకొనగలరు

---

# 5. ప్రాథమిక విద్యాప్రణాళిక - ప్రకృతి విషయములు

ప్రాథమిక విద్యాప్రణాళికలో భూగోళపఠనము రెండవ తరగతినుండియు ప్రారంభమగును. 1 వ తరగతిలో భూగోళపాఠము లేమియు జరుగనక్కరలేదు. 2 వ తరగతిలో ప్రారంభమగును. ఈ తరగతిలో ప్రకృతివిషయములను భూగోళశాస్త్ర జ్ఞానమునకు పనికివచ్చునంతవఱకు గమనింపజేయవలయును తనకుచుట్టుప్రక్కలనున్న నైసర్గిక పరిస్థితులు, ప్రజల జీవిత సౌకర్యములు, ప్రకృతి విచిత్రములు, మనుష్యుని ప్రయత్నము - దాని ఫలితములును విద్యార్థులు గమనించునట్లు చేయవలయును. 3 వ తరగతిలో స్థానిక భూగోళ విషయములన్నిటిని గమనించి స్వయముగ తెలుసుకొనునట్లు ఉపాధ్యాయుడు విద్యార్థులకు మార్గదర్శకుడు కావలయును. 4,5 తరగతులలో విద్యార్థులదృష్టిని వికసింపజేసి తాలూకాయందును జిల్లాయందును ముఖ్యవిషయములను తెలుసుకొనునట్లు చేయవలయును రాజధా ... భాగ

ములను, అందలి నైసర్గిక విషయములు, శీతోష్ణస్థితులు, వర్షపాతము, పంటలు, వృత్తులు, జనులజీవిత సౌకర్యములు, పరిపాలనా విధానములు విద్యార్థులు తెలుసుకొనవలసిన విషయములు. స్థానిక భూగోళ జ్ఞానవిషయములు తామిదివరకు గమనించినంతవఱకు రాజధానికిని జిల్లాకును అన్వయింప జేయుట ఈ తరగతిలో నవసరము. హిందూదేశము నందలి విషయములను స్థూలముగ గ్రహింపజేసి విదేశము లకు గల ముఖ్యవ్యాపారమార్గములను గుర్తింపజేయుట యావశ్యము భూగోళమునందలి నీరు నేలపంపకము, మండ లములును, వానియందలి ప్రజల జీవితమును విద్యార్థులు గమనించునట్లు చూడవలయును. ప్రణాళికలో నేర్పఱచిన విధానమునుబట్టి విద్యార్థి (1) అనుకూలపరిస్థితులు స్వయ ముగ గ్రహించు సామర్థ్యమును పొందును. (2) స్థానికవిష యములను గమనించిన పిమ్మట విశాలదృష్టితో చూచి తన దేశమునకును ప్రపంచమునకును అన్వయించు సామర్థ్యము నొందును. (3) ప్రదేశముల పరిస్థితులనుబట్టి ప్రజల జీవితము నందు కలుగుమార్పులను, సమానలక్షణములను తెలుసు కొనును. (4) ప్రధానముగ కార్యకారణ సంబంధమును గ్రహించి యన్వయించుట కుత్సాహపడును.

## 1, 2 తరగతులలో నేర్పదగిన ప్రకృతిపాఠములు

(పైతరగతులలో గలుగు భూగోళజ్ఞానమునకు ఇది పునాదిగ నుండునట్లు) ఈ దశలో విద్యార్థులదృష్టిని ప్రకృతి విషయములందు నిలుపుటకు ప్రయత్నించినచో చాలును.

అందరికీ ఆకు  బడివెలుపలకు తీసికొనివచ్చి, తోటలోను, ఆటస్థలమునందును. అనేక విషయములను వారు స్వయముగ గ్రహించునట్లు తరిఫీదు నియ్యవలయును. వారి స్వేచ్ఛకు భంగము కలుగకూడదు. కాని వారి యాసక్తి సంరక్షకము గానుండునట్లును, జ్ఞానము కలిగించు మార్గములలో ప్రసరించునట్లును ఉపాధ్యాయుడు చూడవలయును. ఏవిషయముల నెట్లు గమనించవలయునో సూచనలు సేయుచు, వారికి సాయపడవలయును.




(i) సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు - వీనిని గురించి చూచి బాలురు స్వయముగ గ్రహించినవిషయములు.

(ii) రాత్రి - పగలు - వీని భేదములు - కాలమును కొలుచుట - రోజులు, వారములు, నెలలు, సంవత్సరము.

(iii) బడితోటలోని చెట్లు, మొక్కలు, లతలు - వీని పేరులు - వీనికిగల భేదములు.

(iv) పంటలనుగురించి : వరి - జొన్న - వీని చరిత్ర స్వయముగా చూపించుట మంచిది. ముఖ్యముగు వ్యవసాయ విషయములు.

(v) పొరుగుజంతువులు - వానిలో స్నేహభావము - విరోధభావము - మన కెట్లు తోడ్పడును ?

(vi) జీవనమార్గములు - వివిధవృత్తులు - కమ్మరి - కుమ్మరి - వడ్రంగి మొదలగువారి పనులు - సంఘమునకు సాయపడుట.

(vii) గ్రామమందలి వివిధస్థలములు - కట్టడములు - ఏయే భాగములయందున్నవో నిర్ణయించుట - స్థలనిర్ణయమునకు దిక్కులను తెలియుట అవసరము. బడి నాధారము చేసికొని వానిని బోధించుట.

(viii) రాకపోకలు - సౌకర్యములు - వర్తకము.

(ix) మన యాహారము - ఇండ్లు - బట్టలు - ఇతరవస్తువులు - వీనికి సంబంధించిన విషయములు.

(x) సమీపమందలి కొండలు - లోయలు - నదులు - చెఱువులు - కాలువలు చూచి వర్ణించుట.

పై విషయములు దృఢముగ బోధించునపుడు చిత్రములను పటములను గీయించవలెను. నమూనాలు తయారు చేయవలయును. వింతవస్త్రములను గ్రహించవలయును. వీనియందలి భూగోళసంబంధ మెప్పటికప్పుడు ఉపాధ్యాయుడు స్పష్టపఱచుచుండవలెను.

## ప్రశ్నలు

1. ప్రకృతివిషయములు భూగోళజ్ఞానమున కెట్లు సాయపడును ?
2. 1, 2 తరగతులకు నేర్పదగిన ప్రకృతి విషయము లేవి ?
3. ఈ వివరములు తరువాత భూగోళజ్ఞానమున కెట్లు సాయపడును ?
4. భూగోళవిషయమునకు సంబంధ మెట్లు నిరూపించవచ్చును ?

---

# 6. ప్రాథమిక విద్యాప్రణాళిక- స్థానిక భూగోళజ్ఞానము

1. గ్రామమునకు సరిహద్దులు - ఏదిక్కున నేమి కలవో గుర్తించి, చిత్తుగా ప్లానుగీయుంచవలయును. కొలతలు సరిగా నుండవలయునను నియమ మక్కరలేదు; స్కేలు అవసరములేదు.

2. నైసర్గికవిషయములు : ఎత్తుపల్లములు- కొండలు- నదులు-ఇవి యెట్లు ప్రవహించును? ఎందువలన? సరస్సులు- చెఱువులు-కోనేరులు- నీరును నిలువచేయుట - అవసరమును బట్టి విడిచిపెట్టుట ఇందుకు ఉపాయములు.

3. తోటలు-పొలములు-బీడభూములు- పొలములకు నీరు పెట్టుట-కాలువలు-వాని యుపయోగము. పల్లపు ప్రదేశములు-వానిలో పొలములు సాగుచేయుట. మెట్ట ప్రదేశ

ములలోను మెట్టప్రదేశములలోను జనుల జీవితవిధానములు_ వీనిని వర్ణించుట.

4. జంతువులు - పెంపుడు జంతువులు - అడవిజంతువులు - అవయవములు - అవి మనకెట్లు సాయపడును ? - పక్షులు

5 వర్షపాతము - శీతోష్ణస్థితి - వీనిని గమనించుట - వీనికి, పంటలకు గల సంబంధము.

6. వృత్తులు - జీవనోపాధులు - వ్యవసాయము - పరిశ్రమ-ఉత్పత్తి కథ - చేతిపనులు - సమీపమున జరుగునవి చూపించవలయును. వర్తకవ్యాపారములు - మార్కెటు సంతలు - రైల్వేగూడ్సు షెడ్లను, పడవల వార్ఫులను చూపువది.

7. రోడ్లు-అవి యెన్ని రకములు? సైనుబోర్డులు - సముద్రము - లైటుహౌసు మొదలగునవి చూపవలెను. నౌకాశ్రయములు - వాని యుపయోగము.

8. బహిరంగస్థలములు - పార్కులు - దృశ్యములు- వీని యుపయోగములు.

9. పల్లెటూళ్ళు - పట్టణములు - తారతమ్యములు - పట్టణము లెట్లేర్పడును ? పట్టణములలోని ప్రజలసౌకర్యము స్వపరిపాలనాసంస్థలు.

10. రైలుప్రయాణము_ నీటిమీదప్రయాణము - పడవలలో నదుప్రయాణము.

పై విషయముల నీక్రింది విధములగు పాఠశాల, లలో గమనింపు టెట్లు ?

(A) పెద్ద పట్టణములలోని పాఠశాలలు:— పైన వివరింపబడిన వానిలో నైసర్గిక విషయములు (కొండలు, నదులు, సరస్సులు మొదలగునవి) పట్టణములలోని పాఠశాలలలో గమనించుట కంతగా వీలుకలుగదు. సముద్రము నౌకాశ్రయములు — లైటుహౌసులును దేశవిదేశములగు పట్టణములలో గమనించుటకు నవకాశముండును. పల్లెటూరి సౌకర్యములను కూడ గమనింపజేయుట కష్టమే. ఇందుకొరకు విహారములు ఏర్పాటుచేసి నడిపించుట మంచియుపాయము.

(B) చిన్నస్థలములలోని పాఠశాలలు:— వీనిలోని ప్రాముఖ్యముగ వర్తకవ్యాపారములు జరుగువిధానమును, నైసర్గికమైన పొలములను, వాగులను, సమీపమందలి కొండలను గమనింపజేయుట కష్టము. రోడ్లు, వానిలో నడచు రకములు—సముద్రము, లైటుహౌసు, నౌకాశ్రయములను చూపించుటకు అవకాశముండదు. బహిరంగస్థలము, పాఠశాల వీని యుపయోగము. సముద్రయానము, పట్టణములందలి సౌఖ్యములను గమనింపజేయుట కవకాశములు లేవు. సమీపమందలి పట్టణములకు, యంత్రశాలలకు విహారములు నేర్పాటుచేయుట మంచిపని.

(C) ఘోషాగలపాఠశాలలు:—వీనిలోని విద్యార్థినులు వెలుపలికివచ్చి స్వయముగ విషయములను గ్రహించుటకు అవకాశమే లేదు. ఉపాధ్యాయినులకు కూడ సాధారణముగ

నీ నియమము మూలకముచే మరియు నిదయసాధ్యము. బడియావ రణలో మాత్రము గ్రహింపదగిన వివరములను గ్రహింప జేసి మిగిలినవానిని పటములు, మాదిరులు, చిత్రములు ఉపయోగించుచు, వర్ణనలుగల పుస్తకములను చదువుచు, చదివించుచు బోధింపవలయును. స్వయంకృషివలన గమనిం చుట కీపాఠశాలలో నేమియు వీలుకలుగదు.

## వివరములను గుర్తించు విధానము

1. గ్రామము - పట్టణము - వీనిప్లానులు వ్రాయించి ఏదిక్కున నేమియున్నదో గుర్తింపజేయుట (బడిప్లాను. తయారుచేసిన మాదిరిని)-కొండ, లోయ, నది, మార్కెట్టు, రైలుస్టేషను, పోస్టాఫీసు గుర్తింపవలెను.

2. స్వాభావికచిత్రములను తయారుచేయుట, నీటిప్రవాహము, ఆనకట్ట, కాలువ, నీటిపారుదల, నిలువచేసి యవసర మునకు విడిచిపెట్టుటయు-లాకుల చిత్రములు.

3. సమీపమండలి పంటలజాబితాలు తయారు చేయించుట - పల్లపుపంటలు, మెట్టపంటలు - తోటలోను పెరళ్లలోను పండునవి. భూమిలో పెరుగు దుంపలు, వీనికి గావలసిన పరిస్థితులు వర్ణించుట-వరి పైరు, ప్రత్తిమొక్క-వీని కథలు.

4. వాతావరణముల చార్టులు-ప్రతిదినమును విద్యా ర్థులు గుర్తించి స్వయముగ వీనిని తయారు చేయవలయును

వానినిమ్నోన్నతములను తెలియజేయు గ్రాఫులు - ప్రక్కపుటలో మాదిరులున్నవి.

సూర్యుని యెత్తును బడియావరణాలలో కొయ్యపాతి, దానినీడనుబట్టి గుర్తించుట-అనేకదినములలో గలుగుమార్పులనుస్వయముగచూచి, వానిచిత్రమునుతయారుచేయదగును.

4. వృత్తులు-వీనిజాబితా - వీనికిగల యవకాశములు. గ్రామ జనసంఖ్యలో ఎందరేవృత్తిచేయుదురో గమనించవలెను. పరిశ్రమలు-కర్మాగారములు. వానిలో జరుగు పనులు

6. మన ఆహారవస్తువులు - దుస్తులు - వీని జాబితా. ఏవి యెచ్చటనుండి దొరకును? బీదలు - ధనికులు - విదేశస్థులు - వీరిలో భేదములు.

7. రైలుగూడ్సు షెడ్డువద్ద ఎగుమతులు, దిగుమతులు గమనింపజేసి - వీని జాబితా తయారు చేయించవలయును కాలముల మార్పునుబట్టి యివి మారుట-వీని యభివృద్ధిక్షయములను తెలుపు గ్రాఫులు.

## ప్రశ్నలు

1. స్థానిక భూగోళశాస్త్రమున నేయే విషయములను చెప్పవచ్చును?
2. పెద్దపట్టణములలోనున్న పాఠశాలలలో పైవానిలో నేవిషయములు గ్రహించుట కష్టసాధ్యము?
3. పల్లెటూరిబిడ్డలలో గ్రహింపజేయుటకు వీలుపడని విషయములేవి?
4. స్వయముగ గ్రహించిన విషయముల నెట్లు బాలురు గుర్తింపగలరు?

రోడ్లు, రైలుమార్గములు, నీటిమార్గములు, రాజకీయ విభాగములు తెలుపునవి ప్రత్యేకముగ నుండుట చాల యవసరము. వర్షపాత మధికముగను, సామాన్యముగను, స్వల్పముగను గల ప్రదేశములును, పంటలును, జనసంఖ్యాసాంద్రతను, వృత్తులు పరిశ్రమలును వివరముగ తెలుపు పటములుండినచో వాని నుపయోగించి బోధనము సులభముగ నుండును. వానినిబట్టి క్రొత్తవి విద్యార్థులు తయారు చేయుటకు గూడ వీలగును. ప్రయత్నము సాధకముగ చేసినగాని యివి సులభసాధ్యములు కావు. ఒక కేంద్రమునకు సమీపమునందలి పాఠశాలలు కలిసి వీనిని తమ్ముగాని కేంద్రమున నుంచుకొనుట మంచిపద్ధతి. అవసరమయినపుడు ప్రతిపాఠశాలయు వీని నుపయోగించవచ్చును. బుద్ధికుశలత గల యుపాధ్యాయులు వీనిని చక్కగ గ్రహించి, స్థానిక భూగోళపఠనమునకు పనికివచ్చు పటములను పై మాదిరులనుబట్టి తయారు చేసికొనవచ్చును. విద్యార్థులచే చాలవరకు వేయించుటకు వీలగును.

3. మాదిరులు చిత్రములు:— మెట్టప్రదేశములలో వారికి నదుల యానకట్టలు - కాలువలయేర్పాటు - లాకులు - లైటుహౌసు, సముద్రతీరపు రేవు - వీని జ్ఞానము కలిగించుటకు స్వయముగ వారు చూచునట్లు చేయజాలము. అందుచే వీనిమాదిరులను గాని చిత్రములనుగాని సంగ్రహించి బోధించవచ్చును. వీనిని కొనుటకు సాధ్యపడనిచో నుపాధ్యాయుడు స్వయముగ తయారుచేయుట మంచిది.

4. వార్తాపత్రికలనుండియు, భూగోళశాస్త్రములుగల పుస్తకముల నుండియు విద్యార్థులకు వాతావరణ పరిస్థితుల వివరములను సేకరింపజేసి, వాని ననుసరించి శీతోష్ణస్థితిని గూర్చియు, వర్షసూచనను గురించియు, గాలి వీచువానిని గూర్చియు గల సాధారణవిషయములను గ్రహింపజేయవచ్చును. ఇది సాధ్యపడనిచో నుపాధ్యాయుడు ఛాయాచిత్రములను వార్తాపత్రికలనుండి గ్రహించి యుపయోగింపవలయును. వీనికిగూడ అవకాశము లేనియెడల గాలివీచుదిక్కు, దాని స్వభావము, ఉష్ణోగ్రత డిగ్రీలు, వర్షము, ఎండరోజు, పంటల వివరములను గురించి చార్టును తయారుచేసి యుపయోగింపవచ్చును.

5. భూమియాకారము, రాత్రి, పగలు, గ్రహణములు వర్షపుగాలులు, నీరు ఆవిరియగుట మొదలగు విషయములు గ్రహింపజేయుటకు చక్కని యుపకరణము లవసరము. కాని ఇవి చాల ఖరీదుగలవి కనుక ప్రాథమికపాఠశాలలో నుంచుట కష్టము. గ్లోబు ఆకారమును తయారుచేయవచ్చును. దీపమును, బంతిని ఉపయోగించి రాత్రింబగళ్ళు బోధింపదగును. గ్రహణములుకూడ నీ విధముగ నేర్పుటకు ఉపకరణములు తయారు చేయవచ్చును. నీరు ఆవిరియగుటకు సాధారణముగ ప్రయోగము చేయవచ్చును.

ఉపాధ్యాయుడు సమీపమందలి యున్నతపాఠశాలలకును, వస్తుప్రదర్శన శాలలకును విద్యార్థులను గొనిపోయి పై వివరములు బోధించుట యుక్తము.

## ప్రశ్నలు

1. స్థానికభూగోళ విషయముల గుర్తించు మార్గములను వర్ణింపుము?
2. ప్రాథమిక పాఠశాలలో ఉపకరణములతో పాఠములు జరుగుట కాటంకము లేవి?
3. ఉపాధ్యాయుడు వానినెట్లు అతిక్రమించును?

---

# 8. ప్రాథమిక విద్యాప్రణాళిక
# ప్రాదేశభూగోళము

### ప్రాదేశభూగోళ మనగా నేమి?

ప్రపంచమంతటిని భూభాగముగను జలభాగముగను విభజించి, భూభాగమును తిరిగి అయిదు ఖండములుగ నేర్పి అవి యొక్కొక్క ఖండమునందలి వివిధభాగములను గమనించుచు నేర్పుట భూగోళమున పూర్వపద్ధతి. దీనివలన ప్రపంచమందంతటను ఏర్పడియున్న విశాలములగు భూగోళవిషయములు గ్రహించుట కవకాశము లేదు - మరియు తాము నేర్చుచున్న యొక భాగమునకును, వేరొక భాగమునకును సంబంధమేమియు లేదని పసిబాలురు ఊహింతురు. ఇది సరి కాదు. అందుచే భూగోళపాఠములలో నూతనముగ ప్రాదేశ పద్ధతి యాలవాటులో పడినది. దీని ననుసరించి భూగోళ మంతయు విశాలములగు కొన్ని మండలములుగా విభజించి, యొక్కొక్క మండలమునందలి నైసర్గికములు, శీతోష్ణములు

పంటలు, వృక్షములు, జనులు జీవితము మొదలగు విషయములు నిర్ణయించబడును. ఆ విధా నైసర్గిక పరిస్థితులు, వర్షపాతము, పంటలుగల ప్రదేశములలో జనులెట్లు వివిధములుగ జీవింతురని నిరూపింపబడును. దీనియందలి కార్యకారణ సంబంధము కూడ స్పష్టపడును. ప్రదేశములుగ విభజించి, యొక్కొక్క భాగమును క్రమముగా నేర్పుటకవకాశము కల్పించుటచే దీనికి ప్రాదేశపద్ధతియని పేరువచ్చినది.

వర్ణించుపద్ధతి చాలమంచిది - పూర్వపుపద్ధతిలో లోపములు

1. పూర్వపు పద్ధతిప్రకారము పర్వతము, శిఖరము, లోయ, భూసంధి, జలసంధి, అగ్రము మొదలగువాని వివరణము కంఠపాఠము చేయించుచుండిరి. అందుచే బాలుర కాసక్తి కలుగుటకు వీలు లేకుండెడిది. ఆ భూగోళ వివరములను చూపించిగాని వర్ణించిగాని తెలియచెప్పుట వలన విద్యార్థుల కుత్సాహము, ఆసక్తి కలుగును వాని పేరులు తెలియకపోయినను వివరములు దృఢముగ తెలియును.

2. పూర్వపుపద్ధతిలో కార్యకారణ సంబంధమేర్పడక గ్రహించిన విషయములను దృఢముగ మనమున నిలుపుకొనుట దుస్తరముగ నుండెడిది. అందుచే విసుగుపుట్టినను కంఠపాఠము చేయవలసియుండెడు. క్రొత్తపద్ధతిలో దీనికి ప్రాముఖ్యముండుటవలన క్రమమయిన జ్ఞానమును బాలురే యలవడచేసికొందురు.

3. భూగోళవిషయములను వస్తురూపముగ నూహించుటకు విద్యార్థులు ప్రయత్నించుటమంచిది. తమ యనుభవ

ములో నున్న విషయములకు దృఢమగు జ్ఞానము కలుగును విభాగమున కది ప్రత్యేకముగ గ్రహించినపుడు వస్తురూపముగ బోధించుట కవకాశము లేదు.

4. ప్రకృతిపరిస్థితుల నతిక్రమించుటకు మానవుని ప్రయత్నమే భూగోళమున ముఖ్యవిషయము. అనావశ్యకములగు వివరములను పరస్పర సంబంధము లేకుండ నేర్పాటుచేసెడి పూర్వపద్ధతి ప్రకారము మరుగుపడి యుండెడిది. వర్ణించు పద్ధతిలో మానవ జీవితము ప్రస్ఫుటముగ నుండును. ప్రతి పాఠమునందును విద్యార్థులు దీనిని గమనించుటకు మంచి యవకాశము గలదు.

వర్ణించు పాఠములను నిర్ణయించుట, వివిధపద్ధతులు

వీనిని నిర్ణయించునపుడు పాఠములకుగల పరస్పర సంబంధమును దృష్టిలో నుంచుకొన వలయును. ఒకదాని కొకటి సంబంధము లేని పాఠములను నిర్ణయించుటవలన హేతువాద సహితమగు జ్ఞానము కలుగనేరదు. అందుచే నీక్రింది మాదిరిలుగా పాఠములు నిర్ణయించుట మంచిది.

1. నైసర్గిక విషయములు, శీతోష్ణస్థితి, వర్షపాతము, పంటలు, జనసంఖ్యాసాంద్రత, వారి జీవనోపాధులు అను శీర్షికలక్రింద ప్రపంచమందలి విషయముల నుదహరించుచు బోధించవచ్చును. పర్వతములు, నదులు, పీఠభూములు ఒక ఖండమునందును మఱియొక ఖండమునందును పరస్పర సంబంధము కలిగి యెట్లుమరియున్నవో పటమున చూపించి

వర్ణింపవచ్చును. శీతోష్ణస్థితులను దెలుపు మాదిరిలు గలవు. భూమధ్యరేఖ కిరుప్రక్కలనున్న పరిదేశములను, వాటి యందలి వర్షపాతము, పంటలు, జీవితము అన్నియు సమాన ముగ నున్నట్లు నిరూపించవచ్చును.

2. ఒకదేశమును ముఖ్యములగు పరిదేశములుగా నిర్ణయించి యొక్కొక ప్రదేశమందలి నైసర్గికములు, శీతోష్ణములు, వర్షములస్థితి, పంటలు, ప్రజలజీవితమును వర్ణించ వచ్చును. అన్ని ముఖ్యప్రదేశములకు నీవిధముగ జరిగిన యెడల దేశమందు భూగోళ పఠనము పూర్తియగును. హిందూదేశము నీవిధముగ నెన్ని భాగములుగ నూహించ వచ్చునో, ఏభాగమున నేమి నేర్పవచ్చునో మునుముందు చూచెదము.

3. ముఖ్యవిషయములను తీసికొని పాఠములను నిర్ణయించవచ్చును. వ్యవసాయము మనకు ముఖ్యవృత్తి. ఏ యే ప్రదేశములలో నిది యెట్లు జరుగుచున్నది, దీనికి గావలసిన ముఖ్యపరిస్థితులు, దీని యభివృద్ధికొఱకు చేయబడిన ప్రయత్నములు మొదలగు విషయములలో పాఠము నేర్పఁబడవచ్చును. నదులు, వానిపాయలు, అవి ప్రవహించు ప్రదేశముల కెట్లుపయోగించుచున్నవి, నీరువ్యర్థముగ పోకుండుటకు నేమి ప్రయత్నములు చేసిరి. నీటిని భద్రపఱచి యవసరములనుబట్టి యెట్లు సరఫరా చేయుచున్నారో తెలుపుచు పాఠము నేర్పఱచవలయును. ఇట్లే ఇతరవిషయముల నాధారము చేసికొనవచ్చును.

స్థానిక భూగోళ విషయములను గమనించు నపుడే విద్యార్థుల కీమూలవిధిగా పాఠములను నిర్ణయించి బోధించుట మంచిది. అంతనలన భూగోళవిషయములకుగల పరస్పర సంబంధమును విద్యార్థులు సులభముగ గ్రహింతురు కార్య కారణసంబంధము తేటతెల్లమగును. నైసర్గికములు, శీతోష్ణ పరిస్థితులు మొదలగునవి మనజీవితము నెట్లు నిర్ణయించునో తెలుసుకొనగలరు. ఈ యంశములను రుజువుచేయుచు తరు వాత పాఠమున హిందూదేశ మంతటిని గూర్చియు విమర్శింతము.

## ప్రశ్నలు

1. ప్రాదేశభూగోళ మనగా నేమి? దానిని చదువుట యెట్లు ఉప యోగకరము?
2. వర్ణించు పద్ధతిని మన మేల యనుసరించవలయును?
3. పూర్వపుపద్ధతిలో లోపము లేవి?
4. వర్ణించు పాఠముల నెట్లు నిర్ణయించవచ్చును?
5. స్థానికభూగోళజ్ఞానమున కీ పద్ధతి యెట్లు తోడ్పడును?

---

# 9. ప్రాథమికవిద్యాప్రణాళికహిందూదేశము

మనజన్మభూమి హిందూదేశము. దీనిని మనపూర్వులు భరతవర్ష మనియు భరతఖండమనియు వ్యవహరించిరి. 5 వ తరగతి చదివి విడిచిపెట్టు విద్యార్థులు తాముండు ప్రదేశ మును, జిల్లాయును, రాజధానియును చదివినంతమాత్రమున

చాలదు. దేశమందివి భాగములగుటచే దేశమందలి భూగోళ విషయములనువారు గ్రహింపవలెను. పరిశీలించమున నీ దేశము యొక్క యునికి, నైసర్గిక పరిస్థితులు, జనుల జీవనోపాధులు, పరిశ్రమలు మున్నగు విషయముల నెఱుగవలయును. వర్తకవ్యాపారములందు మన దేశపుస్థితిని గమనించి, యిచ్చటి నుండి యెగుమతియగు వస్తువులును విదేశములనుండి యిచ్చటికివచ్చు వస్తువులును తెలుసుకొనవలయును. హిందూదేశపు భూగోళజ్ఞాన మలవడినగాని, విద్య ముగించు బాలురకు భూగోళజ్ఞానము పూర్తియగుననుటకు వీలు లేదు.

స్థానిక భూగోళవిషయములకు. హిందూదేశపు ప్రాదేశ భూగోళమునకు సంబంధపఱచుట :

1. దిక్సూచి మొదలగువాని సాయమున దిక్కుల నేర్పఱచి. ప్లాను తయారుచేయుట తెలియును. దీనిని బట్టి హిందూదేశపటమునకు దిక్కులు, ఎల్లలు గమనింపజేయునది.

2. వాతావరణముల స్థితిని వివరముగ కనిపెట్టు జ్ఞానము బాలురకు కలదు. దీనినిబట్టి హిందూదేశమున వాతావరణస్థితిని ఊహించి నిర్ణయించునట్లు చేయదగును - పత్రికలనుండి వర్షపాతము, వాయుభారము. ఉష్ణోగ్రత, ఉష్ణమాంద్యమును తెలియుచేయు వివరములను గుర్తించి, వాని నుండి గ్రహించదగిన విషయములను నిర్ణయించ వచ్చును,

3. నైసర్గిక స్థితులలో గమనించదగిన ముఖ్య విషయములను హిందూదేశపటమునుబట్టి స్వాయముగ తెలుసుకొని నిర్ణయించ వచ్చును.

4. స్థానికములగు పంటల కేర్పాటు : గతినిబట్టి యనుసరించియే నిర్ణయించి యుండును. కావున వీనినిబట్టి హిందూదేశపు పరిస్థితులను పరిశీలించి, యేప్రదేశములలో నేపంటలు పండునో నిర్ణయించవచ్చును. గంగాసింధు మైదానము సారవంతమైనది. నీటివసతియు, వర్షపాతమును అనుకూలముగ నున్నవి. పల్లపు ప్రదేశమగుటచే అవసరమగు వేడిమికలదు. అందుచే నిచ్చట వరిపంట విస్తారము, గోదావరి, కృష్ణా, కావేరి మొదలగు నదులజిల్లాలలోను పై కారణముల వలననే వరిపంట యధికమని గుర్తింపజేయునది.

5. జనులవృత్తులు నిర్ణయించుటకు కావలసిన పరిస్థితులు స్థానికభూగోళజ్ఞానమువలన తెలిసియుండుటచే, వీని ననుసరించి హిందూదేశమున జనులవృత్తు లాయాప్రదేశములలో తెలుసుకొనవచ్చును. వ్యవసాయము మేయేప్రదేశములందలి జనుల ముఖ్యవృత్తిగా గమనింపవచ్చును.

6. రాకపోకలకు సాధారణముగనుండు సాధనములు స్థానిక భూగోళజ్ఞానమువలన తెలిసికొంటిమి. వీనినిబట్టి హిందూదేశమునగల రాకపోకల మార్గములను, సాధనములను నిర్ణయించుకొనవచ్చును,

హిందూదేశమందలి ముఖ్యప్రదేశముల నిర్ణయించి చదువుట

(a) నైసర్గిక స్వరూపమునుబట్టి మూడు ముఖ్యప్రదేశము లేర్పడు చున్నవి.

(i) హిమాలయపర్వత ప్రాంతము : హిమాలయములు—వానిలోనిశిఖరములు—వీనియుపయోగము— దేశసంరక్ష

ణము - చలిగాలి యుత్తరమునుండి రాకుండ చేయును-నదులకు ఉత్పత్తి స్థానము-ఇందలి జీవజాలము-జనులజీవితము.

(ii) గంగా సింధు మైదానము : సారవంతముగ నుండుట-వరి, గోధుమ ముఖ్యముల పంటలు - గొప్పపట్టణములు కలవు - పెద్దరాజ్యము లుండెడివి-జనులు నాగరికులు-వీరియాచార వ్యవహారములు-భాష.

(iii) దక్షిణము పీఠభూమి : దీనినైసర్గిక - పరిస్థితులు తూర్పుపడమటి కనుమలు - వర్షముతక్కువ - మెట్టపైరులు పండును. తీరపు మైదానములు-ఇచ్చటి పంటలు-జనసంఖ్య.

(b) <u>శీతోష్ణస్థితినిబట్టి :</u>

(i) భూమధ్యరేఖకు సమీప ప్రాంతములు : వీని యందలి యుష్ణోగ్రత - పీఠభూమిలోని చల్లదనము : నీలగిరులు - ఇచ్చటి పంటలు - జనులజీవితము - నాగరికత.

(ii) సమశీతోష్ణభాగములు - గంగాసింధు మైదానములు - ఇచ్చటి నీటివసతి - సాంద్రజనసంఖ్య - పట్టణములు - నాగరికత - రాజ్యములు.

(iii) అతిశీతలమగు హిమాలయ ప్రాంతము : పంజాబు - కాశ్మీరము - గోధుమ ముఖ్యమగుపంట - ప్రజలు దృఢకాయులు, ధైర్యసాహసములు కలవారు - వింతలగు కాశ్మీర దృశ్యములు.

వీనిని బోధించుటకు వలయు చిత్రములు

1. హిమాలయ పర్వతప్రాంతము - అందలి శిఖరములు-లోయలు.
2. పంజాబులో నదుల పాయదల ఉపనదులు మొదలగునవి.
3. ఖైబర్ బోలన్ కనుమలు - అందలి ప్రయాణముల దృశ్యము.
4. వరిపైరు - మూడు దశలను కనబరచు చిత్రము.
5. గోధుమపంటను చూపిన చిత్రము.
6. ఉత్తర హిందూస్థానమందలి పెద్ద పట్టణముల దృశ్యములు - కాశీ - కలకత్తా - ఆగ్రా - ఢిల్లీ - లాహోరు - కాన్పూరు.
7. తాజమహాల్, జుమ్మామసీదు హుగ్లీనది ముఖములు మొదలగునవి.
8. దక్షిణపీఠభూమి - నైసర్గికస్థితులు
9. నీలగిరులు - ఆప్రాంతమందలి పంటలు.
10. ఆనకట్టలు - కాలువలు - లాకులు - నీటిని నిలువ చేసి యుపయోగపరచు సాధనములు.
11. శివసముద్ర జలపాతము - వానియందలి పని.
12. భద్రావతి ఇనుపగనులు - తాతాకంపెనీ యంత్రాలయములు.

13. పూర్వకాలము నాటి కోటలశిథిలములు - దేవాలయములు మసీదులు.

14. వివిధ భాగములందలి ప్రజలు - వారు జీవించు పద్ధతులు.

15. మహాపురుషుల చిత్రములు - స్థలముల ప్రసిద్ధి.

ఈ మొదలగు చిత్రముల నుపాధ్యాయుడు సంగ్రహించ గలుగు నంతవఱకు ఉపయోగించవచ్చును. అధికముగ కూడ జాగ్రత్త చేయుటకు ప్రయత్నించవలయును.

ఇవి ప్రాథమిక పాఠశాలలలో సప్లైచేయుట చాల

దుస్తరమగు విషయము. పాఠశాలల యాజమాన్య మొక్కరి చేతిలో గాని, యొకసంస్థలో గాని లేదు. వివిధములగు సంస్థలును, వ్యక్తులును వీనిని నిర్వహించుచున్నారు. గవర్నమెంటువారి స్వంతపర్యాలోచనలో నున్న పాఠశాలలకు వీనిని సప్లైచేయుట సులభము. గ్రంథాలయములకును చిత్రవస్తు ప్రదర్శనశాలలకును అందుబాటు కలిగినయెడల, అవసరములగు చిత్రములను సందర్భానుసారము తెచ్చి యుపయోగించవచ్చును. లోకలుబోర్డులు, మ్యునిసిపలు సంస్థలును నిర్వహించు బడులలో కూడ వీనిని సేకరించుట సుకరము. కాని ద్రవ్యలోపకారణముగ నీపని సాధారణముగ జరుగుచుండుటలేదు. ఎయిడెడు పాఠశాలలకు వీనిని పూర్తిగ సంగ్రహించుకొనుట యసాధ్యము. కారణమేమనగా: వీనిఖరీదు చాల యధికము. ఇవియున్నియు దేశ

భాషలలో వివరింపబడిన సూచనలుకలవి కావు. ఎక్కువగ నింగ్లీషు భాషను వాడుదురు. ఈ తరగతి పాఠశాలలు స్వయంపోషకములు కాకుండుటచేతను, వీనిలో పనిచేయు వారు చాలమంది ఇంగ్లీషు తెలియనివారగుటచేతను, వీనిని ధారాళముగ నుపయోగించుటకు వీలుండదు. ఉపాధ్యాయులు వీనిని స్వయముగ చిత్రించుకొని యుపయోగింప వచ్చును; లేదా కేంద్రములలో వీనిని సంగ్రహపరచి వరుస వెంబడిని పాఠశాల లుపయోగించును.

## ప్రశ్నలు

1. హిందూదేశమునుగూర్చి చదువుటకు స్థానిక భూగోళము జ్ఞానమెట్లు సాయపడును.
2. శీతోష్ణస్థితినిబట్టి హిందూదేశము కెన్ని ప్రదేశములుగా విభజింప వచ్చును ?
3. నైసర్గికస్వరూపమునుబట్టి యెన్ని భాగములగును? అవియేవి ?
4. వీనిని బోధించుటకు కావలయు చిత్రములేవి ?
5. మన పాఠశాలలలో నివి నష్టయి యగుట కాటంకము లేవి ? వాని నెటు దాటవచ్చును.

# 10. ప్రాథమిక విద్యాప్రణాళిక : ప్రపంచ భూగోళము

## ప్రారంభదశ : కథలతో ప్రారంభించుట

భూగోళమును బోధించుటకు చేయుప్రయత్నము కథలతోడనే జరుగవలయును. ప్రపంచభూగోళ విషయములను బాలురచే గ్రహింపజేయుటకిదియే మొదటి సోపానము. స్థానిక భూగోళవిషయములు తన పరిసరములకు సంబంధించినవగుటచే, వానిని తెలుసుకొనుటకు విద్యార్థి యుత్సాహపడును. మరియు స్వయముగ తెలుసుకొనుట కవకాశముండుటచే, విద్యార్థిచేయు ప్రయత్నముకూడ నీయాసక్తిని వృద్ధిపొందించును. కాని ఎచ్చటనో నివసించు జనులదేశమును అచ్చటిపరిస్థితులను తెలిసికొనుటకు పసిబాలురు కుతూహలపడజాలరు. కావున వారికాసక్తి కలిగించు ప్రయత్నము నుపాధ్యాయుడు విధిగా చేయవలయును. బాలురకు కథలనిన నాసక్తి యధికము. కావున నీ సందర్భమున నుపాధ్యాయునికి కథ లెక్కువగా తోడ్పడగలవు.

### కథలను నిర్ణయించి చెప్పుటయెట్లు ?

1. ప్రపంచమందలి యితర భాగములలో నుండు ప్రజలజీవితమును వర్ణించు కథలుమాత్రము గ్రహించవలెను.

2. పసిబాలురు బాలురనుగూర్చి వినుటకాసక్తిపడుదురు; కావున కథలు బాలురజీవితమును వర్ణించునవిగా నుండవలయును.

3. జంతువులు, పక్షులు, వింతగొలుపు విషయములు బాలుర కాకర్షకములు—వానినిగూర్చిన కథలు నిర్ణయించుట మంచిది.

4. కథలను చెప్పినందువలన కొన్ని భూగోళవిషయములను బాలురు గ్రహింపగలిగి యుండవలయును. వేడుకకొఱకు చెప్పిన కథలవలన నుపయోగము కలుగదు.

5. కథలను చెప్పునపుడు బాలుర యనుభవమునకు సంబంధపడునట్లు చూడవలయును. కేవలము నూతన విషయములను తెలిపినచో ఆసక్తి నిలువక, విసుగు కలుగును.

6. మధ్య మధ్యను ఆగుచు, కథాభాగములను తిరిగి చెప్పించుచు, బాలుర సహకారమును అపేక్షించవలయును. ఉపాధ్యాయుడు తానే చెప్పుకొనుచు పోయినచో బాలురకుదృష్టి నిలువదు. శ్రద్ధ తగ్గును. గ్రహించిన విషయములు దృఢపడవు.

7. కథాంశములకు సంబంధించిన చిత్రములను చూపించి వర్ణింపజేయుట చాల మంచియుపాయము.

8. కథకు పాత్రలగు మహాపురుషులనుగూర్చి చెప్పునపుడు వారినిగూర్చి వ్రాయబడి, వాడుకలోనున్న పాటలను పద్యములను చదివి యుపయోగించదగును.

మంచికథలు — చెడ్డకథలు.

భూగోళమున బోధించుకథలు, ఆ జ్ఞానమునకు తోడ్పడ గలిగియుండవలయును. అట్లు సాయపడునవి మంచికథలు.

చేయజాలనివి చెడ్డకథలు. హిందూదేశపు భూగోళమున గంగానది యుత్పత్తినిగూర్చి భగీరథుని కథ చెప్పవచ్చును. భగీరథుని ప్రయత్నము మాత్రమే వివరించినయెడల, అది చెడ్డకథయే. హిమాలయప్రాంతపు చిత్రమును చూపి, గంగ పుట్టి ప్రవహించుచోటులను గ్రహింపజేసినచో నిది మంచి కథయే యగును. భూగోళమునకు సంబంధపడిన కథలను చెప్పుటకు క్రిందివిషయములను గమనించవలయును.

1. ప్రారంభమున మనుష్యులు, పిల్లలు, పశువులు, జంతువులను గురించి కథలు చెప్పుచున్నను క్రమముగా నీయంశము తగ్గించి, ప్రజలజీవితము, జంతుజీవజాలముల స్థితి మొదలగువానిని గమనింపజేయుట యవసరము.

2. కథలను అధికముగా చెప్పుచు నాయా ప్రాంతములనుగూర్చి విద్యార్థులు తమ భావములలో చిత్రములను తయారుచేసుకొనగలిగినట్లు సాయపడవలయును.

3. వివిధప్రాంతములందలి జీవితపరిస్థితులలోగల తేడాలను కథలద్వారా స్పష్టపఱచవలయును. తమజీవితము నచ్చటచ్చటి జీవితములతో సరిపోల్చుకొని విద్యార్థులు క్రొత్త విషయములను గ్రహింతురు.

4. ఆయా ప్రదేశములలో పంటలనుబట్టి అచ్చటి జనుల వృత్తుల నిర్ణయించుటకు తగినట్లు కథలు సమకూర్చవలయును. సముద్రప్రాంతములవారికే గాని చేపలు పట్టుట, ఓడలు తయారుచేయుటయు వృత్తులు గానేరవు. నీటివసతి, సారవంతమగు నేలయు అనుకూలములగు శీతోష్ణస్థితులును

కలుగుచోటులలోనే వ్యవసాయము ముఖ్యవృత్తి. ఇనుము, బొగ్గు సమీపమున నదొరకు స్థలములందే యంత్రాలయములు వృద్ధిపొందునని చూపించవచ్చును.

5. ఎడారి ప్రదేశములు, పచ్చికబీడులు గల ప్రదేశములు, కేవలము పర్వతప్రాంతములు, అడవిప్రదేశములు మొదలగు ప్రదేశములందలి జనులవృత్తు లాయా పరిస్థితులనుబట్టి యుండుననే గ్రహింప జేయవలయును. ఒంటెను 'ఎడారియోడ' యని చెప్పుటకు కారణములను గ్రహింప జేయవచ్చును.

మాదిరికి యీక్రింద కనుపఱచబడినకథ లీయబడెను.

## మాదిరికథలు

### (1) ఇథూరి అరణ్యములోని పొట్టివారు

చీకటిపడినది. ఇథూరి అరణ్యములో మృగముల ధ్వనులెక్కువయ్యెను. చిఱుతపులుల యఱపులు మెండుగ వినవచ్చుచుండెను. ఏనుగులగుంపు లాహారమునకై లేతచెట్ల కొమ్మలను విఱుచుచుండెను. పెద్దచెట్ల కొమ్మలలో నడవి పక్షులు కూయసాగెను. కోతులు కోపపడునట్లు అఱచుచుండెను. కోతిపిల్లలు యేడ్వసాగెను. పదులలోను, గుంటలలోను నీళ్ళ నాశ్రయించుకొని యుండు బోదురు కప్పలు బెకబెకలాడుచుండెను. ఈ ధ్వనులన్నియు కీకారణ్యమున ప్రతిధ్వనుల నీనుచుండెను.

బాంబిలికుమారుడును మువుమును యీశబ్దముల కేమాత్రము భయపడలేదు. వాని చిన్నగ్రామము యీయరణ్యమధ్యమునందే గలదు. కాని చీకటిలో తన గ్రామమును విడిచి కొన్ని గజములు నీ వాతని పొమ్మన్నచో వాడు భయపడును. రాత్రులందు సంచరించు దయ్యములు వాని నీడ్చుకొనిపోవునని గడగడ వణకిపోవును.

ఆ గ్రామములో నొక పెద్దకుటీరముముందు మువుము, బాంబిలి, యిక కొండలును మట్టినేలపై కూర్చుండిరి. ఆ కుటీరము మిక్కిలి తెలివైన 'ముబుకు' అను వృద్ధుడు వసించునది. నెఱసిన తలగల ముబుకు కథల జెప్పుటలో నారితేరిన వాడు. పగలు కథలు చెప్పినచో గంధర్వులు వారి నావేశింతురను భయమున వారికి రాత్రిపూటయే కథలు చెప్పుటకును, వినుటకును తగిన సమయము.

'తాతా! పెద్దజంతువు, చిన్నజంతువుకథను చెప్పు' మని మువుము ముబుకు నడిగెను. తక్కినవారు ఏకగ్రీవముగ "అవును తాతా! పెద్దజంతువు— తెలివిగల చిన్నజంతువు కథను చెప్పవోయి" అనిరి.

అంత ముబుకు పూర్వము కేబియావర్తకు నొద్ద తన తాత కొనియుండిన పొడుము డబ్బానుండి ఒక చిటికెడు పొడుమును తీసి పీల్చి, "ఏనుగు-ఊసరవెల్లి" కథను చెప్పసాగెను. దీనిని వారనేకసారులు వినియున్నను మఱలమఱల వినుటకు వారికి ఇష్టముగ నుండెను. ముబుకు చెప్పినరీతినే మీరా కథను వినుడు.

అనగ నగగ ఒక పెద్దయేనుగు. గొప్పవాడనని గర్వముతో అరణ్యమున నొకనాడు పోవుచుండెను. ఆ యేనుగున ఊసరవెల్లి యెదురుపడెను. 'చిన్నదడకలదానా! నాదారి నుండి తొలగిపొమ్ము' అని యేనుగనెను. 'ఓ అసహ్యముగు నడకల కొండా! నేనునీకంటె మెల్లగనడతునా, మన మొకనాడు నడకలో పందెము వేతుమా?' అని యూసరవెల్లి జవాబిచ్చెను.

ఏ:— సరి. రేపే పందెము. ఒప్పుకొందువా?

ఊ:— నేను సిద్ధమే అంగీకరించితిని.

ఊసరవెల్లికి తొంబదితొమ్మిదిమంది సోదరులు. అందఱు ఒక్క పోలికనే యుందురు. ఆరాత్రి వారిని కలుసుకొని, "నే నొక పందెము వేసితిని. ఏనుగుతో నడకలో గెలువవలెను. మీరు నాకు సాయపడవలెను. లేకున్న మన జాతికి అవమానము కలుగును. మీరు పందెపు బాటలో సమానదూరమున నుండుడు. పెద్దజంతువు మీలో నొక్కొక్కరిని దాటిన వెంటనే ప్రక్కనుండు పొదలో దాగుకొనుడు" అని చెప్పి తొంబదితొమ్మిదవ సోదరున కిట్లనెను: "నీవు జయస్తంభమునకు కొద్దిదూరములోనుండి ఏనుగును చూచినంతనే దానికంటె ముందుగనే జయస్తంభము వద్దకు పరుగెత్తుము."

మఱునాడు పందెము. నూరు ఊసరవెల్లులు తమ తమస్థానములందు సిద్ధముగ నుండెను. అరణ్యములోని జంతువులన్నియు పందెము చూడవచ్చినవి. సింహము పందెమును ప్రారంభింపజేసెను. వృద్ధమృగము జయస్తంభము నొద్ద గెలుపు

నిర్ణయించుటకు సిద్ధముగ నుండెను. ఒక్కత్రుటిలో గజేంద్రుడు ఊసరవెల్లిని వెనుకవడవేసెను. ఆరంభమునందే యూసరవెల్లిని దాటితినిగదా యని యేనుగు గర్వమున ఘీంకారము చేసెను. కాని రెండడుగులలో మరల యూసరవెల్లి తనకంటె ముందు కనబడెను. "అయ్యో! నేను దీనిని దాటితిననుకొంటినే! ఇదేమిది చిత్రము!" అని మరల గజము త్వరగ నడచి దానిని వెనుకవడవేసెను కాని మరల ఊసరవెల్లి తనముందు ప్రత్యక్షమయ్యెను సాయంకాలమాపయుగు దిక్కుతోచక తొండముతో కన్నులు నులుముకొనుచు పరుగెత్త సాగెను. చివరికి జయస్తంభము సమీపించుచునప్పటికి తనకంటె ముందుగనే ఊసరవెల్లి జయస్తంభమును చేరుటచూచి "అయ్యో! ఏమి నాపాపము!" అని విచారముతో తల వంచుకొనెను.

ఊసరవెల్లి తన సోదరులు కలసి చేసినమోసము నెవ్వరికిని తెలియనీయలేదు. ఊసరవెల్లి కుటుంబములో ఆనాడు గొప్ప పండుగ జరిగెను. అప్పటినుండి ఏ యేనుగుగాని ఊసరవెల్లిని గూర్చి అమర్యాదగ మాటలాడక తాను వేగముగ పరుగెత్తుచున్నపుడును 'చిన్నితమ్ముడా!' యని ప్రీతి యూసరవెల్లిని పలుకరించి పోవుచుండెడివి

కథ పూర్తియైనది. అందఱు కడుపుబ్బ నవ్విరి. ముఖము మొదలు ముప్పును వఱకు ఊసరవెల్లి మోసము నకు సంతోషము పట్టజాలక నేలపై దొర్లిదొర్లి నవ్వించిరి

ఉదయముననే వారు మేల్కాంచిరి. ధాన్యము పండించుకొనుటకు వారికి పొలములు లేవు చేపలు పట్టుట తెలియదు. అడవిలో దొరకిన ఆహారముతోనే జీవించు చుందురు. బొంబిలీ మొదలగు పెద్దవాండ్రు కుప్పిచర్మముతో చేసిన అమ్ముల పొదులను బుజాన వ్రేలాడ వేసుకొని గట్టి కొయ్యబాణములను అందు పొదిగి నరములకు బిగించిన గట్టిపట్టాలకు చిన్న మట్టి పాత్రలను అమర్చి వేట కొఱకు నరణ్యములోనికి పోవుచుండిరి. ఆ మట్టి పాత్రలలో నున్న విషయములో వారు బాణములకొనలను గ్రుచ్చి విండ్లకు ఎక్కుపెట్టి జంతువులను వేటాడుదురు. అడవిలో చెమ్మనేలలందు ఆకులు, పూవులు చెట్లనుండి రాలి కుళ్ళు చుండెను. జంతువులు పోయినజాడల ననుబట్టి వారు నిశ్శబ్దముగ పోవుచుండిరి. ఎండునేలను నడచిపోయిన వారి యలికిడికి జంతువులు పాఱిపోవునని భయము. ఇట్లు పోయి పోయి ఒక చిన్న బయలులో పొట్టి గేదె యొకటి శాంతముగా మేయుచుండుటను కనిపెట్టి వెంటనే వారు విడిపోయి బయలుచుట్టు గుండ్రముగా సర్దుకొనిరి. పదునైన పొట్టిబాణములను విషములో ముంచి ఆగేదెపైని అన్నివైపులనుండి విడిచిరి, ఆదెబ్బలు తిని యాగేదె యాశ్చర్యముతో నలు వైపుల కోపముతో చూచెను. ఎవ్వరును కన్పడ లేదు. అరణ్య మధ్యమున కడు పరుగెత్తెను. వారు దానిని వెంబడించిరి. అది కొన్నిగంటలు తిరిగి తిరిగి యొకచోట పడి చచ్చి పోయెను. వెంటనే వారు దాని మాంసమును తీసికొని తమ గ్రామమును చేరిరి.

గ్రామములోని స్త్రీలును, పిల్లలును వారిని సంతోషముతో నెదుర్కొని పెద్దవిందు చేసికొనిరి. వారికి వంటవిశేషములు తెలియవు. మాంసము సరిగా నుడకలేదు. అయినను వారు మిక్కిలి యానందముతో విందు నారగించిరి.

మష్టము, తక్కిన వారలందరును అడవిలో దూటి తేనె, పండ్లు, తియ్యని దుంపలు కూడుకొని వచ్చిరి. ఒకపెద్ద చెట్టుక్రింద తొఱ్ఱలో నున్న తాబేలును కూడ తెచ్చిరి. తేనె తెట్టెలో చేయిదూర్చుటకు ఆ పిల్లలు భయపడరు. ఆ యీగలు వారిని కుట్టినట్లు లేదు.

స్త్రీలు గ్రామములో తీరిక లేక పని చేయుచుండిరి. కొందఱు అరణ్యమున కావల వసించు నల్లజాతివారినుండి తెచ్చుకొన్న యినుప తీగెలతో గాజులు తయారుజేయుచుండిరి. కొందఱు పొడుగుపాటి కొమ్మలను తెచ్చి వానిని గుండ్రముగ భూమిలో నాటిరి. వాని చివరలను వంచి కలిపి కట్టుచుండిరి. ఈ కొమ్మల మధ్యస్థలములను పిల్లలు ఆకులతో నింపుచుండిరి. పెద్దవర్షములో కూడ ఆ యింటిలో నీటిచుక్క పడదు. కాని అటువంటి పిల్లయిండ్లు ఎక్కువ కాలముండవు. ఉట్లుండనక్కఱలేదు. ఏలయన: వారు ఒక్కచోట యెక్కువ కాలము వసింపరు. వేటాడుచు ఒకచోటినుండి మఱియొక చోటికివారు పోవుచునే యుందురు. కావున వారికాయిల్లు చాలకాలము మన్నికపోయినను లెక్కలేదు.

మష్టమున వాని బంధువులను మనము 'పిగ్మీలు' అందుము. ఆఫ్రికా మధ్యభాగమున నున్న దట్టమైన కథూరి అరణ్యమున వసించు పొట్టివారలే ఆ పిగ్మీలు. వనువుమించిన

కంకరరంగు వారిధాయు. వారిలో పొడవరికూడ నాలుగడు గులకు మించియుండదు. వారికి సిగ్గు మెండు; ఇతరులకు కన బడరు. ఇనుగుపొరుగువారైన యితర ఆఫ్రికావాసులు వారిని అరుదుగ చూతురు. అయినను వారు స్నేహస్వాతులు; కలసి మెలసియుండురు. వారి వర్తకవ్యాపారము చాల వింతగ నుండును. అడవిపండ్లు, దుంపలు, తేనె, మాంసము మొద లైనవానిని వారొక చెట్టునకు వ్రేలాడకట్టుదురు. ఆ కట్టు విధమునుబట్టి వానికి బదులుగ వారికేమి కావలసినదియు అచ్చటి ప్రజలకు తెలియును. కావున వారు వానిని తీసికొని వానికి బదులు ధాన్యము, ఇనుము, ఉప్పు మొదలైన వానిని అచ్చట పెట్టెదరు. పిగ్మిలి వెళ్లి వీనిని తెచ్చుకొందురు. ఉప్పు వారికి చాలయిష్టము.

వింవారగించిన వెంటనే ఆగ్రామవాసులు నృత్యము చేసిరి. వృద్ధులందరు చుట్టును గుండ్రముగ కూర్చుండిరి. వయసువారు నృత్యమును ప్రారంభించిరి. కోతిచర్మపు తప్పెటలు ధసధస మ్రోగెను. ఎఱుపు, తెలుపు రంగులు ముఖమున పూసుకొని కొమ్ములు నూదుకొనుచు వింతవింతగ జంతువులవలె శబ్దములు చేయుచు ఒకరివెంట నొకరు నృత్యము చేయుటకై వచ్చిరి. తప్పెటలు ఎక్కువగ మ్రోగెను. వంగుచు, లేచుచు, తిరుగుచు కాలితో మెత్తని నేలపై శబ్దమగునట్లు మోదుచు నొక వలయముగ నేర్పడి వారు నృత్యముచేసిరి, ఇట్లొక గంట నడిచెను. తప్పెట లాగెను. నృత్యముచేయువారలసి నేలపై వ్రాలిరి. ఆ కీకా రణ్యము మధ్యనుండి రయిక సూర్యకిరణము వారిపై ప్రస

రించెను. అది మధ్యాహ్నము... వారందరు వారి వారి చిన్న కుటీరములలో ప్రవేశించిరి. ఒక్కొక్కరి గూళ్లలో వారందరు నిద్రించుచుండిరి.

(3) ఎస్కిమోలు

కూగాక్, అతని సోదరి టూమసాక్ మంచిపిల్లలు. వారు నుట్టియింటిలో దీపముచెంత తోళ్ళు పరచుకొని కూర్చుండి వారి అవ్వ చెప్పుచున్న కథలు వినుచుండిరి. అల్లరిపిల్లలను తీసికొని వెళ్ళు 'కలాపలింగు' అను రాక్షసిని గూర్చి ఆమె చెప్పుచుండెను. ఆ కథలో 'అగ్లగ్' అను అల్లరిపిల్లవాని నొకరాక్షసి తీసికొని వెళ్లినటులే "మిమ్ములను కూడ తీసుకవెళ్ళును." అని వారి అవ్వ చెప్పెను.

అప్పటినుండియు పిల్లలు అల్లరి మానిరి. ఆ క్రూర రాక్షసి వికృత శబ్దములు చేయుచు తెల్లని భయంకరమైన పండ్లు చూపుచు, కనపడుట వారికిష్టము లేదు. ఇతరవస్తువులను మోసగించి ఆహారమంతయును తానే తిను కాకికథ యన్న వారికి చాల యిష్టము ఆ కాకి వలెనే ఎస్కిమో పిల్లలుకూడ ఆహారము ఎక్కువగ లభించునప్పుడు చాల తిందురు.

ఎస్కిమోలు వంశపరంపరగ చెప్పుకొను ఆ ప్రాత కథలను వారి అవ్వ చెప్పుచుండగ ఆ యింటిలోని స్త్రీలు సీలుచేప తోళ్ళతో కోట్లను, పరాయిలను కుట్టుచుండిరి. ఎముకతో చేయబడిన సూదులను వారు కుట్టుట కుపయోగించుచుండిరి. చేపలు పట్టుటకును, సీళ్ళను పట్టుటకును

కుక్కలను వెంటతీసికొనివెళ్లిన వారి తండ్రి పినతండ్రుల కొఱకై సాయంకాల భోజనమును సిద్ధము చేయుచుండిరి. ఇరుకైన ద్వారముగుండ వారు ఇంటిలో ప్రవేశించునప్పటికి సీళ్ళమాంసపు వంట సిద్ధమయ్యెను. వారు కోట్లను విప్పి, తోళ్లజోళ్లను దీపమువెలుగున తడిఆరుటకై పెట్టిరి. వెంటనే భోజనములు ప్రారంభించిరి. వారు మొదట నొక కొమ్ము గిన్నెతో మాంసరసమును త్రాగిరి. సీళ్ల పచ్చిమాంసమును కత్తులతో ముక్కలు ముక్కలుచేసి తినిరి. వారి పినతండ్రి చాల ఆకలిగ నున్నందున పెద్ద మాంసపుముక్కను తీసికొని, కత్తితో కోయకయె ఒకచివరనుండి తినుచుండెను.

గిన్నెవలె చెక్కబడిన ఒక ఱాతిలో దీపము వెలుగుచుండెను. సీళ్ళ క్రొవ్వునుండి తీయబడిన చమురు అందులో పోసిరి. ఆ తైలములో ఒక నాచువత్తి తేలుచుండెను. ఆ నాచువత్తి చివర వెలుగుచు పచ్చనికాంతుల నిచ్చుచుండెను. ఆ దీపము చాల చిన్నదైనను, ఆ యింటికి తగిన ఉష్ణమును, కాంతిని యిచ్చుచుండెను. వారి యింటివెలుపల తీవ్రమైన చలిగాలి వీచుచున్నను, మంచుగడ్డలు కుప్పలు కుప్పలుగ దొర్లుచున్నను వారు యింటిలోపల వెచ్చగ సౌఖ్యముగ నుండిరి. వారి కాయింటిలో చాలినంత యాహారముండెను.

భోజనానంతరము బయట వాతావరణస్థితి యెట్లున్నదియు తెలిసికొనుటకై వారిపినతండ్రి వెలుపలకు వచ్చెను. మరల యింటిలోపలకు వచ్చి వెలుపల గాలి నిశ్శబ్దముగ

నున్నదనియు, సముద్రపుమంచు గట్టిగను నున్నగను నుండి వేటకు పోవుటకు తగియున్నదనియు చెప్పెను. వెంటనే ఆ కుటుంబమంతయు శీతకాలపు ప్రయాణమునకు కావలసిన సామాగ్రినంతను సిద్ధముచేయుచుండిరి. దీపములను, సీళ్ల మాంసపు ఆహారమును, సీలు తోళ్ళు, ఎలుగుతోళ్లతో చేయ బడిన పడకగుడ్డలు, దుప్పట్లు సిద్ధముచేయుటలో తల్లికి టూము సోక్ సహాయపడుచుండెను.

కూగాక్, ఇతరపురుషులును వేటకు కావలసినికొమ్ము బూరలు, ఈటెలు, బల్లెములు, కొయ్యముక్కలు మొదలైన వానిని సిద్ధము చేసిరి. కొయ్యతో చేయబడిన స్లెడ్జిబండ్లను వారిలో ఒకరు ప్రయాణమునకు సిద్ధముచేసిరి.

ఇతర పురుషులు, బాలురు కుక్కలను వారి స్లెడ్జిబండ్లకు కట్టుచుండిరి, ఎస్కిమో పల్లెయంతయు ప్రయాణమునకు సిద్ధముగ నుండెను. ఆ కుక్కలు చాల అందమైనవి. వానికి చక్కని పొడవైన వెండ్రుకలు, కుచ్చు తోకలు ఉన్నవి. అవి సింహాపుపిల్లలంత బలముకలవి, భయంకరమైనవి

అన్ని కుక్కలను స్లెడ్జిబండ్లకు కట్టులోపల బండ్లను సామానులతోడను, మూటలతోడను, నింపివేసిరి. తోళ్ల దుస్తులను ఆహారమును పిల్లలనుకూడ ఆ బండ్లపై వేసిరి. ఆ పిల్లలకు అచ్చటి తీవ్రమైన చలి లక్ష్యములేదు. ఆమంచు ప్రపంచమే వారుచూచిన విచిత్ర జగత్తా అనునట్లు, ఆ పిల్లలు నల్లనికండ్లతో వారి తోళ్లదుస్తులలోనుండి తొంగి తొంగి చూచుచుండిరి.

'అంగకాక్' అను వృద్ధుడు ఎచ్చట ఎక్కువ నీళ్లు దొరుకునదియు బాగుగ తెలిసికొనగలడు. అతని స్లెడ్జిబండి ముందు ప్రయాణమయ్యెను. దాని వెనుక న్యాగ్రామమంతయు కదిలెను.

అప్పుడు మధ్యాహ్నమైనను సూర్యుడాకాశమున బారెడైన ఎక్క లేదు. త్వరలోనే వారికి మరల సూర్యుడు కన బడడు. కాని నక్షత్రములు, చంద్రుడు, ఉత్తరపుదిక్కు కాంతులు వింత వింతగ కనబడును. అచ్చట ప్రకృతియంతయు ధవళమై శాంతముగ నుండెను. ఆ మంచు ఎడారిలో ఏ ఒక్క జీవజంతువైన నుండునని ఎవ్వరును తలంచరు. కాని వారు ప్రయాణము చేయుచున్న ఆ మంచుగడ్డల నేలక్రింద చేపలు, సీళ్లు మందలు మందలుగ నుండును. కొద్దిరోజులలో వలనే అవి ఎస్కిమోల పాలబడును.

సాయంకాలమునకు కూగాక్, అతని స్నేహితులు అంగకాక్ చూపిన స్థలమును చేరిరి. క్షణములో బాలురు, బాలికలు, పురుషులు, స్త్రీలు అందరు పనిచేయుచుండిరి. ప్రతికుటుంబమునకు ఒక మంచుటింటిని కట్టుటకై తెలివిగల వారు సిద్ధపడిరి. మంచుగడ్డలను ముక్కలు ముక్కలుగ కోసి మధ్య నిలువబడి యింటిని కట్టుచున్నవానికి అందించుచుండిరి. క్షణములో ఇట్లు తయారయ్యెను. ఒక పెద్దమంచుగడ్డనుకోసి కిటికీ ఏర్పాటుచేసిరి. ఒక చిన్న గుడిసెఆకారముగ మంచు టిల్లు తయారయ్యెను :

అట్లా మంచుగడ్డనె సిద్ధమైన వెంటనే అంచులు త్రాళ్ల సందులను మంచుబురదతో పూడ్చి లోనికి చలిగాలి ప్రవేశింపకుండునట్లు చేసిరి. వారి నివాసమునకు కొంత దూరములో ఆ మంచుటింటిలోనికి ప్రవేశించుటకు చిన్న వాకిలి త్రవ్వచుండెను. వాకిలి పూర్వముగ నున్నందున ఇంటిలోనికి చలిగాలి త్వరగా ప్రవేశింపదు. ఎస్కిమోలా శీతకాలపు ఇంటిని 'ఇగ్లస్' అందురు. ఆ మంచుటింటిలో చాల చలిగ నుండునని మనము భావింతుము. కాని లోపల దీపము వెలిగించి, అచ్చట పొయ్యిపై లోహపు పాత్రల వారు సాయంకాల భోజనమునకు కూర్చున్నప్పుడు లోన చాల వెచ్చగనుండును. సక్కతోళ్లతో చేయబడిన కోట్లను విప్పివేసి, పలుచని సీలుతోళ్లతో చేయబడిన చొక్కాలనుమాత్రము ఉంచుకొని వారు భోజనము చేయుదురు. కాని వెలుపల అధికముగ చలివేయుచుండును. మనపిల్లలైనచో అచ్చట ఎన్ని శాలువలు కప్పుకొన్నను ఆ మంచులో గడ్డకట్టి చనిపోవుదురు.

భోజనానంతరము పురుషులు మంచి కథలు చెప్పుకొనుచు మరుసటిదినమునకు వేటకు కావలసిన కొమ్ములు, త్రాళ్లు సిద్ధము చేసుకొందురు. ఈలోపల స్త్రీలు దీపము వెలుగున బూట్లను వెచ్చజేసి మరునాడు ధరించుటకు తగినట్లు చేయుదురు. ఈపని పూర్తియైన వెంటనే వారు కుట్టుపని ప్రారంభింతురు. కుటుంబమునకు కావలసిన దుస్తులన్నియు వారే కుట్టుకొందురు.

ఎస్కిమోల దుస్తులు అందముగనుండవు. శీతకాలములో పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు అందరు

ఒకేవిధమైన దుస్తులను ధరింతురు. లోపల సన్నని సీలు తోళ్ళతో చేయబడిన ఉడుపులు ధరించి దానిపైన వెంట్రుకలు లోపలకు ఉండునట్లుగ నొకచొక్కా,షరాయి ధరింతురు. వానిపైన వెంట్రుకలు వెలుపలికి ఉండునట్లుగ వేఱొక ఉడుపును ధరింతురు. ధృవపుజింక తోలతో చేయబడిన బూట్లలోనికి వారు షరాయిని పోనిచ్చెదరు. బాలురు ధరించు దుస్తులకు, బాలికలుధరించు ఉడుపులకు ఎక్కువ వ్యత్యాసముండదు. వెనుకవైపున ఒకవిధమైన తిత్తి స్త్రీల దుస్తులకు ఉండును. ఎస్కిమో స్త్రీలు ఆ వెనుకతిత్తిలో పిల్లలను వేసికొని పోవుచుందురు. వారి దుస్తులకు జేబులుండవు.

మరుసటిదినము ఉదయముననే పురుషులు, బాలురు కుక్కలతోను స్లెడ్జిబండ్లతోను సీళ్ళ వేటకై వెళ్ళిరి. స్త్రీలు, బాలికలు ఇండ్లకడ నుండిరి.

వృద్ధుడైన అంగకాక్ ఆ మంచుసముద్రముపై వేటకు మార్గము చూపెను. అతడు 'మికి' అను కుక్కనువదిలిపెట్టి వింతవింత శబ్దములు చేసెను. ఆ కుక్క చెవులు నిక్కపొడుచుకొని, తోక ఎత్తుకొని నేల వాసనచూచుచు వెళ్ళెను. అది సీళ్ళున్న స్థలమును వాసనపట్టుచుండెను. సముద్రము మంచుగడ్డలచేత కప్పవడినను సీళ్ళు గాలిని పీల్చుటకై రంధ్రములుచేసికొని పైకివచ్చును. అవి పైకివచ్చుట నా కుక్క వాసనపట్టును. సీలు ఒక రంధ్రము చేసి దానిని రోజంతయు నుంచును. కాని మరునాడా రంధ్రముపై

మంచు పేటకొనుటచే సీలు ఆ రంధ్రము వద్దరకే మరలవచ్చు ననుటు నమ్మకము లేదు. కాని కుక్క మాత్రము దానిని గ్రహించును. అది వెంటనే రంధ్రమునొద్ద ఆగును. కూగాక్ అతని పినతండ్రి ఆ రంధ్రమునొద్దనే వేచియుండిరి. మిగతవారు ఇతర రంధ్రములను కనుగొనుటకు వెళ్లుదురు.

సీలుకొరకై వేటగాడు ఒకరంధ్రముచెంతనే చాల కాలము వేచియుండవలయును. అది వచ్చినపుడు మెఱుపు కంటె చురుకుగ పనిచేయవలెను. లేనిచో అది చిక్కదు. తిరిగిలోనికి వెళ్ళిపోవును.

ఆ కుక్క ఆగిన రంధ్రమునొద్ద తోళ్ళబొమ్మల వలె కూగాక్, అతని పినతండ్రి కాచియుండిరి. కూగాక్ త్వరగ మంచుగడ్డలతో ఒక చిన్న గోడనుకట్టెను. దానిచాటున వారు పొంచియుండగ సీలు పైకివచ్చెను. వెంటనే పినతండ్రి ఒక బల్లెముతో సీలును పొడిచెను. ఒక కొక్కెమును దాని తలనుగ్రుచ్చి అతడు బల్లెమును పైకిలాగుచుండెను. కూగాక్ పినతండ్రికి సహాయము చేసెను. దానిని వారిరువురు కత్తులతో పొడిచిచంపిరి. వెనుక కాళ్ళకు త్రాడుకట్టి దానిని వారు స్లెడ్జిబండియొద్దకు లాగిరి.

ఇట్లే ఇతర వేటకాండ్రును సీళ్ళను పట్టిరి ఆ రాత్రి వారి యిండ్లలో గొప్పవిందు జరిగెను. ఆ మరుచటి ఉదయము స్త్రీలు, బాలికలు, ఆ సీళ్ళ చర్మములను దుస్తుల కొరకై శుభ్రము చేయుచుండిరి.

చలికాలము పూర్తికావచ్చినపుడు సూర్యకిరణము లాభాగమున ప్రసరించుట ఆగిపోవును; అప్పుడు వారు వారి యిండ్లకు వచ్చి, రానున్న వేసవికాలమునకు సిద్ధపడుదురు. వేసవిలో నివాసమునకై తోళ్ళతో గుడారములను తయారు చేయుదురు. వేసవిలో మంచు కరగిపోయి అచ్చటచ్చట మాత్రమే గడ్డలుండును. అప్పుడు వారు చేపలను పట్టుటకును, తిమింగిలములను పట్టుటకును, చిన్నపడవలలో పోదురు. వారు పల్లప్రదేశములలో సంచారము చేయునప్పుడు వారికి ధృవపుజింక అచ్చటచ్చట అడ్డువచ్చును. అప్పుడు వారు వానిని పట్టుకొని చంపుదురు. వాని మాంసము, ఎముకలు, తోళ్ళు అన్నియు వారికి మిక్కిలి ఉపయోగము. తోళ్ళతో చేయబడిన గుడారములు వారికి వేటసమయమున మిక్కిలి ఉపయోగించును. దానిని ఒక మనుష్యుడు సులభముగ మోయగలడు. ఆ గుడారమును వేయుటయు, తీయుటయు చాల సులభము.

అచ్చట వేసవికాలము చాల తక్కువ. సూర్యుడు చాలదినములవరకు అస్తమించడు. అచ్చటి ధ్రువసముద్రములచుట్టు నున్న మంచు కరగి నీరు ఏర్పడకపూర్వమే ఎస్కిమోలు వేసవిదినములను, వేసవిపక్షులను, మృగములను వదలి సముద్రతీరమున నున్న వారి మట్టిగృహములను చేరుదురు.

## (3) ఐస్‌లాండ్

ఐస్‌లాండ్‌లో ఇద్దరుపిల్లలగూర్చి తెలిసికొందము. వారు టొగ్గి, సిగ్గా. టొగ్గి పూర్తిపేరు టోర్‌గ్రిమ్ జాన్‌సన్.

సిగ్గా పూర్తిపేరు జాన్స్ డాటిర్. కాని వారిని ఇంటిలో టొగ్గి అని, సిగ్గా అని పిలుతురు.

ఐస్‌లాండ్ అనగనే మనకు మంచుగడ్డ జ్ఞాపకము వచ్చును. చలికాలములలో నచ్చట చలి చాల అధికము. ఐస్‌లాండ్ ఒక ద్వీపము. ఐరోపాఖండములో వాయవ్య దిక్కున చాలదూరములో ఈ ద్వీపమున్నది. ఆ ద్వీపము ఉత్తరదిక్కునుండి జూన్ నెలలో అర్ధరాత్రి సూర్యుని చూడవచ్చును.

ఐస్‌లాండ్ చాల పెద్దద్వీపము. అచ్చట జీవితము చాల కష్టము. చాలస్థలము పనికిరానిది. అందుచేత జనసంఖ్య చాల తక్కువ.

ఇంగ్లాండునుండి ఈ ద్వీపమునకు ప్రయాణము చేయుట చాలకష్టము. అచ్చట కాడ్ అను చేపలు పట్టుటకై చాల పడవలు వెళ్ళును. ఇవి చిన్న స్టీమర్లు.

దూరమునుండి ఆ ద్వీపమును చూచినచో మేఘముల మధ్యనున్న తెల్లని పెద్దపర్వతమువలె నుండును. అదే "వాట్నాజోకుర్" అను అగ్నిపర్వతము యొక్క వాలు. అచ్చట సంవత్సరమంతయు మంచుగడ్డలు అమితముగ నుండును. మనము దగ్గరకు చేరుకొలదని సూర్యరశ్మిగల మంచు నేల మనకు కనబడును.

గొప్ప అగ్నిపర్వతము 'హెక్లా' చక్కగ కనబడుచుండును. రాళ్ళమయమైన సముద్రతీరము కనబడును.

కొనలు తేలిన నల్లనిరాళ్ళపై సముద్రపు నురుగు కొట్టుకొను చుండును. ఆ రాళ్లద్వీపములనే 'వెస్టర్ మాన్సు' అందురు. అచ్చట సముద్రపు పక్షులు ఎక్కువ. అచ్చట బాతులు చాల ఎక్కువ. వాని మెత్తని ఈకలు దిండ్లకును, పరుపుల కును పనికివచ్చును. చెవులపిల్లులవంటి చిన్న జంతువులకూడ నుండును చిన్నవలలతో ఈ పక్షులను, జంతువులను పట్టుదురు. బాతుల గూండ్లలోని గ్రుడ్లను, ఈకలను ప్రోగు చేయుదురు. వారు చాల అపాయకరమైన పర్వతాగ్రము లను చాల సులభముగ ఎక్కగలరు. 'రైక్ యూవిక్' అఖా తములోని 'ఎన్ జి' ద్వీపములో ఈజాతిబాతులు ఎక్కువ. బాతులవల్లనే కొందఱు వ్యవసాయదారులు జీవనము చేయు దురు. ఆ ఈకలను ఎండవేసి, కట్టలుకట్టి యితర చోట్లకు పంపుదురు.

'రైక్ యూవిక్' అను చిన్నపట్టణములో నా ద్వీపము లోని ఐదవవంతు జనులుందురు. వీధుల వంకరైనవి. ఇండ్లు కొయ్యతోను, ఇనుముతోను కట్టుదురు, ఇండ్లకు నల్ల ఱాతితో పునాదులు వేయుదురు. ఆ పట్టణములో యిండ్లు చాలఎత్తున నున్నవి. 'రైక్ యూవిక్' అనుపేరు చాల వింత యైనది. విక్ అనగా అఖాతము, రైక్ యూ అనగా పొగ. మొట్టమొదట నార్మను లీద్వీపమునకు వచ్చినపుడు అచ్చటి అఖాతములో చాలరకములైన పొగలు కనబడెను. అందుచే వారు దానికి 'పొగలఅఖాత' మని పేరుపెట్టిరి. ఆ పట్టణ ములో చాల వింతయైన చాకలిసావు ఉన్నది. అచ్చట ఒక

వేడినీటి ప్రవాహమున్నది. దానిప్రక్కనే రేకుపాకలలో స్త్రీలు గుడ్డలను ఉతుకుచుందురు. వారు గుడ్డల నుతుకునపుడు మాట్లాడుకొనుచు మధ్యమధ్య వేడికాఫీ త్రాగుచుందురు. వారచ్చట నిత్యముబట్టల శుభ్రముచేసికొనుటకై వేడినీటినొసంగిన ఆ ప్రకృతిచిత్రము వారికి చాల ఆశ్చర్యకరముగ నుండును.

ఊలుటోపీని, ఊలుదుస్తులను ధరించి టొగ్గి సముద్రపు ఒడ్డుననున్నాడు. అతడచ్చట స్వారిచేయు గుఱ్ఱముయొక్క కళ్ళెమును పట్టుకొనియున్నారు. అతనివెంట సిగ్గా ఉన్నది. ఆమె వెంట్రుకలు పచ్చగ బంగారువలె మెఱయుచున్నవి. ఈద్వీపములో పొట్టిగుఱ్ఱములు ఎక్కువ. అవి చాల కష్టము చేయును. అచ్చట రైలుబండ్లు, ట్రాములు, బస్సులు, లేవు. పొట్టిగుఱ్ఱములపైననే ప్రయాణము చేయవలయును. సామానులుకూడ పొట్టిగుఱ్ఱములపైననే తీసికొనిపోవలయును.

ఆ ద్వీపములో ప్రతివారికి స్వారిచేయుట వచ్చును. అచ్చటి వారెవ్వరును నడచి ప్రయాణము చేయరు. వృద్ధులు, యువకులు, వృద్ధస్త్రీలు, యువతులు, బాలురు, బాలికలు అందఱు పొట్టిగుఱ్ఱములపై స్వారిచేయుదురు. అచ్చటి పొట్టిగుఱ్ఱములు జారుబండలలోను. ఆ కోనురాళ్ళ మార్గములలోను చాల త్వరగ పోగలవు. అందుచేత స్వారిచేయువారు చాల జాగ్రత్తగ నుందురు. స్వారిచేయు జీనుకు సిగ్గా చాల కుట్టుపనిచేసి, ఇత్తడి మేకులతో అలంకరించినది.

చాల లోపలకు వెళ్లినచో నాద్వీపముయొక్క నిజ స్వభావము మనకు బాగుగ తెలియును. చిన్న చిన్న నదులలో నా పొట్టిగుఱ్ఱములు బాగుగ నీదును. మనకు నదులను దాటుటకు చిన్న పడవలుండును. నదులను దాటి లోపలకు వెళ్ళినచో నా ద్వీపమునంత నావరించియున్న కొండలు, అగ్నిపర్వతము లు కనబడును.

టొగ్గి, సిగ్గాలు వసించుయిల్లు చాల చిన్నది. రేకుల కప్పు, చిన్న కిటికీలు. ఇండ్లకు మెఱయుచున్న రంగు. వేసవిలో పోగుచేసిన ఎండుగడ్డిని కొయ్యయిండ్లలో దాచెదరు. ఆగడ్డిని చలికాలమున ఆవులకు మేతగా నుపయోగింతురు. పొట్టిగుఱ్ఱములపై గడ్డిమూటలను వేసికొని వచ్చెదరు. అప్పుడు చూచుటకవి నాలుగుకాళ్ళపై నడచుచున్న గడ్డి కొండలవలె నుండును.

వారు అతిథులకు ప్రత్యేకముగ నొక గది నిచ్చెదరు. ఆ ద్వీపములోని గృహస్థులు ప్రయాణీకుల నాహ్వానింతురు. ప్రయాణీకుల కొఱకై ప్రత్యేకగది ప్రతివారియింటిలో నుండును.

'సాల్ మన్' అనుచేపలతో సాయంకాల భోజనము చేసి కాఫీ త్రాగుదురు. కొంతసేపు మాట్లాడి వారు నిద్రించెదరు.

ఆ ద్వీపములోని వేడినీటిగుండములు చాల వింతయైనవి. 'గైసర్' అనుగుండమునుండి వేడినీరు ధారగవచ్చుచుండును. ఇట్టి వేడినీటి గుండము లాద్వీపమున చాల

ఉన్నవి. అగ్నిపర్వతములున్న దేశములలో నిట్టి వేడినీటి గుండములు చాల తరుచుగనుండును.

పచ్చని మైదానమును, నల్లనికొండలను దాటిపోయి పచో విశాలమైన లోయలలోనికి వెళ్ళుదుము. అచ్చట పొట్టిగుఱ్ఱములు మేయుచుండును. అచ్చటచ్చట చిన్నకొయ్య వంతెనలపై దాటి లోయను దాటిపోయినచో నల్లనేలలు చూచుదుము. ఒకప్పుడు అగ్ని పర్వతములనుండి వెలువడిన బురదపడి యేర్పడిన దా రాతిప్రదేశము. ఇప్పు డా ద్వీపములో వేడినీటిగుండములు, అగ్నిపర్వతములు లేనిచోట కూడ ఇట్టి 'లావానేల' యున్నది.

రోడ్డు ప్రక్కలనున్న గుంటలలోని నీరుకూడ వెచ్చగనుండును. కొన్ని గుంటలలోనుండి ఆవిరికూడ వచ్చుచుండును. ఇచ్చట మన మొక ఎత్తుప్రదేశమును చేరెదము. ఇచ్చట నొకగిన్నెవంటి నీటిగుంట ఉన్నది. ఆనీటిగుంటనుండి ఒక పెద్దగొట్ట మున్నది. అప్పుడప్పుడు పెద్దశబ్దముతో వేడి నీరు పైకి చిమ్ముచుండును. నీరు పైకి వచ్చునపుడు చాల భయంకరమైన శబ్దము కలుగును. మరల వెంటనే నీరు చిమ్ముట ఆగును. దీనికి దగ్గరలోనే చాల ఉష్ణగుండములున్నవి. 'స్ట్రాకురు' అనునది ఒక ఉష్ణగుండము. ఆ గుండములోనుండి తుపానువలె నీటితుంపరలు వచ్చుచుండును. బురదగుంటలనుండి వింతవింత శబ్దములు చేయుచు బుడగలు లేచుచుండును. ఇవి అన్నియు టొగ్గి సిగ్గాలకు బాగుగ

పరిచయము. వారు ప్రయాణములో మనవెంట నున్నచో మనకు అపాయములు తప్పును.

## (4) లా ప్ లాం డు

యూరప్ ఖండమున చాల ఉత్తరముగనున్న ధృవ సముద్రములోని దీవులలో 'తురి' అనబడు లాపుజాతివా డుండెను. ధృవసముద్రపు ప్రాంతములలో చలి చాల మిక్కుటముగ నుండును. మంచుచాల దట్టముగ గడ్డకట్టియుండును. తీవ్రమైన చలిగాలులు మన ముఖములపైకి వీచుచుండును. సూర్యుడు కనబడకనే చాలదినములు గడచిపోవును.

కాని మధ్యాహ్నసమయమున నాకాశము స్వచ్ఛముగ నున్నపుడు దక్షిణదిశగ చూచినచో అదృష్టవంతులైన దక్షిణదేశముల ప్రజలపై సూర్యుడు ప్రకాశించుచున్నాడని తెలిసికొనదగిన సూర్యకాంతి కనబడుచుండును. ఎప్పుడు పగలైనదియు, ఎప్పుడు రాత్రియైనదియు తురి ఎట్లు తెలిసికొనునా! అని మనమాశ్చర్యపడుదుము. వారు నక్షత్రములను గమనించి కాలమును చెప్పుటలో చాల తెలివిగలవారు. శీతకాలములో చాల పొడవైన రాత్రులు ప్రారంభమైనను రాత్రివూట తరచుగ చీకటిగ నుండదు. అచ్చట తెల్లని మంచుగడ్డలు కొంత తెల్లనికాంతి నిచ్చును. ఆకాశమున ధృవనక్షత్రములు బ్లూ, ఆకుపచ్చ, ఆరెంజి, వైలెట్, బంగారు, ఎఱుపు మొదలైన రంగులను వెదజల్లుచుండును.

కాని వేసవిలో మంచుగడ్డలు కరగిపోయి చిన్నచెట్ల యరణ్యములలోను విశాలమైన గడ్డిబయళ్ళలోను పక్షులు,

జంతువులు చేరును. అట్టి వేసవిలో చాలదినములవరకు సూర్యుడస్తమించడు. అర్ధరాత్రివేళకూడ భూమిపై చల్లని కాంతిని ప్రసరింపజేయు ఎఱ్ఱని సూర్యబింబమును మన మప్పుడు చూడగలము.

పొట్టిచెట్ల యరణ్యములు ఉత్తర శీతలవాయువులు రాకుండ అడ్డుగనున్న ఒక పల్లపుప్రదేశములో తురిజాతివారు పల్లె కట్టుకొందురు. దానికి సమీపముననే విశాలమై, లోతు లేని సరస్సున్నది. దానిలో మిక్కుటముగ చేపలు, అడవి పక్షులు వాసముచేయుచుండును. లాప్పులు మిక్కిలి చలి కాలములో వసించుటకు కట్టుకొన్న గుడిసెల సమూహామే ఈ గ్రామము. ధృవపుజింకలు చాల దట్టమైన మంచుగడ్డల అడుగుననున్న నాచును తిని జీవించును. అందుచేత వారు వారి ధృవపుజింకలను నాచు ఎక్కువగనున్న ప్రదేశము లకు తీసికొనిపోదురు. వేసవిలో మంచుగడ్డలు కరిగిపోయి నప్పుడు ధృవపుజింకలు పల్లపునేలలలోనున్న పచ్చికను మేసి, జీవించును. కాని దోమలబాధ ఎక్కువైనపుడు ధృవపుజింక లను కొండప్రాంతములకు తరిమివేయుదురు. కొండప్రాంతము లలో దోమలబాధ తక్కువ. అవి కొండప్రాంతములనున్న నత్తువెనగడ్డిని బాగుగ మేసి మలముగనుండును.

ధృవపు జింక నాచుమేయుట చాలచిత్రముగనుండును. మంచుగడ్డ నేలపై నేమియులేని దినములలోకూడ నేలపై కదలుచున్న ధృవపుజింక తోకలను చూడగలము. అవి మంచుగడ్డల లోపలకు దూరిపోవును. అవి వాటికొమ్ములను పదునుగల గిట్టలను ఉపయోగించి మంచుగడ్డలను త్రవ్వి

లోనసున్న నాచును తినుటకై మారును. ఆ పల్లపు ప్రదేశమున తురియొక్క గుడారమున్నది. అది మన దేశములోని గుడిసెలవలె 'ఫర్' చెట్లయొక్క కొమ్మలలో వేయబడినది, అది ఉన్ని కంబళ్ళతో కప్పబడును. అది ఆఱుఅంగుళాల ఎత్తు ఇగువదడుగుల చుట్టుకొలతయుండును. చలిగాలులు లోన ప్రవేశించకుండ లావైన ధృవపుజింక తోళ్ళను వ్రేలాడవేయుటకై యొక కొయ్యముక్క వాకిలిపై నుండును ఆ గుడారమును వేయుటకుగాని, తీసివేయుటకుగాని అరగంట కంటె ఎక్కువకాలముపట్టదు. ఆ గుడారము చాల ఖరీదగును. చాలకాలముండునట్లుగ, లాప్పులు తమ గుడారములను చేయుదురు.

గుడారములోపలకు వెళ్ళి చూతము. లోన గడల నుండి ఒక గొలుసు వ్రేలాడుచుండును. ఆ గొలుసుచివర నొక యినుపపాత్ర గట్టియుండును. ఆ ఇనుపపాత్ర దిగువ చిన్న మంటయుండును. ఆ మంట వంటచేయుటకు చాలదు. గదిలో తగినంత యుష్ణమును కలిగింపజాలదు. ఆ గుడారములో నొకమూల ఉయ్యాల వ్రేలాడుచుండును. అందులో పసిబిడ్డను పరుండబెట్టి పైన ధృవపుజింక తోళ్ళను కప్పుదురు. లోనకూడ మెత్తగను వెచ్చగ నుండుటకై మృదువైన తోళ్ళను వేసియున్నారు. వాటిమధ్య పండుకొనియున్న ఆ బిడ్డ నల్లని కండ్లతో చూచుచున్నది. ఆ పాప ఏడ్చుటలేదు. లాప్పులపిల్లలు ఏడ్వరు. వారి ఆస్తి దాచబడిన ఆ ఘూజలపెట్టెయే వారికి మిక్కిలి విలువగల వస్తువు. కొన్ని వెండిసామానులు, మరికొన్ని ఖరీదగు వస్తువులు

లందున్నవి. గడ్డకట్టిన ధృవభూజింక పాలతో నిండిన రెండు కొయ్యపాత్రలున్నవి. కాఫీమరగినప్పుడు, తురితల్లి ఆ గడ్డకట్టిన పాలముక్కల నందులో వేయును. ఒకటిరెండు కలకండముక్కలను కొరికి అందువేయును. తురి, అతనికుటుంబము భోజనమునకు కూర్చుందురు. ధృవపుజింక మాంసము, చేపలు, కాఫీ వారి యాహారము. కొన్ని సమయములలో రొట్టెలను చేసి బొగ్గులపై కాల్చి తిందురు.

తురి, వాని తల్లిదండ్రులు ఒకేవిధమైన దుస్తులను ధరింతురు. ధృవపుజింక తోళ్ళతో జేసిన షరాయీలు వేసుకొని, ధృవపుజింక ఉన్నితో చేయబడిన కోట్లను ధరింతురు. వారు చలికి చెవులపైకి వచ్చు టోపీలను ధరింతురు. పసుపు ఎఱుపు రంగులతో తురియొక్కతల్లి ఆమెటోపీని అందముగ కుట్టినది. అందఱు చేతులకు ఉన్నితో చేయబడిన తొడుగులు వేసుకొందురు. గట్టి చర్మముతో కుట్టబడిన బూట్లను కాళ్ళకు తొడుగుదురు. బూట్లలోపల వెచ్చగ నుండుటకై 'సెనా' అను మెత్తనిగడ్డిని పెట్టుదురు. మెత్తని బాతు ఈకలతో తురి తన టోపీని చేసినాడు. అతను దానిని తన చెవులపైకి లాగుకొన్నప్పుడు మనకతని ముఖము బాగుగ కనబడదు. అప్పుడతనికి వెచ్చగను సంతోషముగ నుండును.

వారందఱు పొట్టిగను, లావుగను నుందురు. తీవ్రమైన చలిగాలులు వీచు దేశములలో నుండు ప్రజల ముఖముల వలె వారి ముఖములు వాడియుండును.

ఇచ్చట స్లెడ్జిబండి యున్నది వారు దానిని పుల్కా అందురు. అది చుక్కానిగల చిన్న పడవవలె నున్నది. గట్టి

మంచుగడ్డలపై పరుగెత్తుటవలన దాని యడుగుభాగము నున్నగ నున్నది. కాళ్ళమధ్యగ మెడలో త్రాడు కట్టబడిన ధృవపుజింక ఆ బండికి కట్టబడును. దానికి ఒకటే త్రాడు ఉండును. ఆ త్రాటిని ఒకవైపు వేసినచో అది సాగిపోవును. వేఱొకవైపునకు వేసిన ఆగిపోవును. ఆ బండిలో తురి కాళ్లు చాచుకొని, వెనుకబల్లకు ఆనుకొని హాయిగ కూర్చుండును. అతడొక ధృవపుజింక చర్మమును కప్పుకొని ఎంతటి చలి గాలినైనను లక్ష్యపెట్టడు. ఆబండిలో చాల గట్టిగాకూర్చొన వలయును; లేనిచో పడిపోవుదురు. ఒక్కొక్కప్పుడు ధృవపుజింక మలుపుతిరిగినప్పుడు జాగ్రత్తగ కూర్చొన్నను పడిపోవచ్చును.

ఈ ధృవపుజింకలకు తోడేళ్లు శత్రువులు. ఆ తెల్లని పెద్దజంతువులు సింహములవలె ధైర్యముగలిగి. భయంకరముగ నుండును. తోడేళ్ళగుంపు వచ్చినచో ధృవపుజింకల మందనంతను చంపివేయును. తోడేళ్ళరాకను కుక్కలు వారికి తెలియజేయును.

అవి మందపై బడినప్పుడు డోడేళ్ళుతోడేళ్ళు అని యఱచెదరు. వెంటనే లాప్పులందరు బల్లెములు తీసికొని ధృవపుజింకలు పరుగెత్తుచున్న స్థలమునకు వచ్చెదరు. చాల భయంకరమైన పోరాటము జరుగును. అయినను ఆకలిగొన్న ఆ తోడేళ్ళు మందలో కొన్నిటినైన తినివేయును. పడిపోయినవానిని తినివేసి అవి మఱల మందపైకివచ్చును; కాని చివరకు వారు తోడేళ్ళను చంపుదురు. లాప్పులు తోడేళ్ళ

కంటె త్వరగ పరుగెత్తగలదు. అట్లు పరుగెత్తి దానిని పట్టి చంపుదురు.

తరి వేటకుపోయినప్పుడు తన గుడారమును తీసు కొని వెళ్ళును. మంచులో పక్క వేసుకొని ధృవపుజింక చర్మ మును కప్పుకొనును. చర్మముల కొరకై యాతడు నక్కల వేటాడును. మంచులో వలలు పన్ని పక్షులను, మృగము లను పట్టును. తెల్లనక్క చిక్కినచో వారికి చాల సంతో షము. దాని చర్మము చాల ఖరీదగును.

వేసవిలో సూర్యుడు మబ్బల కనబడినపుడు ఇరువది నాలుగు గంటలు వెలుగుచుండును. అప్పు డా టండ్రా భూములకు పక్షులు, జంతువులు మందలు మందలుగ వచ్చును. లాప్పులు పచ్చిక బాగుగా పెరిగియున్నచోట ధృవపుజింకల మేపుకొనుచు పక్షులు, మృగములు దొరకు చోట్ల కొన్ని దినము లాగుచు, చాలదూరము సంచారము చేయుదురు. వారు గుడారములకు కలువల చిన్న చెట్లమధ్య కొమ్మలకు చర్మములు కట్టి ఉయ్యాలలను తయారు చేయు దురు. వానిలో ఆహారమును, గుడ్డలను ఇతరవస్తువులను, దాచుకొందురు. పచ్చిమాంసము మొదలగువానిని నేలపై నుంచినచో తోడేళ్లువచ్చి తినిపోవును.

వారు చలికాలములో వేసికొను దుస్తులకంటె వేస విలో ధరించుదుస్తులు అందముగను సన్నముగను నుండును. వారు తోలుతో చేయబడిన జుబ్బావంటిచొక్కాను తొడుగు దురు. చేతుల చివరను, చొక్కా అంచులవద్దను బ్లూ,

ఎఱుపు, ఆకుపచ్చ రంగులతో కుట్టి అలంకరించెదరు. వెండి అలంకారములున్న ఒక తోలుపట్టాను నడుముకు పెట్టుకొందురు. ఆపట్టాలో తురియొక్క తండ్రి వేటకత్తిని పొడుగు పెట్టెను దాచును. దట్టమైన ఉన్నితో చేయబడిన పరాయిని తొడుగుదురు. పరాయి అడుగు భాగమును ధృవపుజింక చర్మముతో చేయబడిన బూట్లలోనికి పోనిచ్చెదరు. బ్లూ, ఎఱుపు రంగులతో అందముగ చేయబడిన టోపీని వారు పెట్టుకొందురు.

అందఱు లాప్పులవలెనే తురికూడ ఆటలన్న మిక్కిలి ఇష్టపడును. మంచుబంతులతో నాటలాడుట అతనికి మిక్కిలి ప్రీతి. లాప్పులు వింతవింతకథలు చెప్పుకొందురు. అతనికి కథలువినుట చాల సంతోషకరము. కొన్ని వేసవిరాత్రులలో ఇండ్లవెలుపల కూర్చుండి తెల్లవారువరకు వారు కథలు వినుచు, పాటలు పాడుచుందురు.

ఇతర లాప్పుబాలురకంటె తురి చాల అదృష్టవంతుడు. అతడు దక్షిణమున చాల మైళ్ళదూరమునున్న పట్టణము నకు సంవత్సరమునకు రెండుపర్యాయములు వెళ్లును. వారు తోళ్లు, దుస్తులు, ఉన్ని, చెక్కడపుపనులు చేసిన కొయ్య సామానులు; ధృవపుజింక చర్మముతో చేసిన బూట్లు తీసి కొనివెళ్లి, వానికిబదులు పిండి, బియ్యము, బట్టలు, పొగాకు మొదలైనవానిని తెచ్చుకొందురు.

## ప్రశ్నలు

1. ప్రారంభదశలో కథలతో నేల ప్రారంభించవలయును ?
2. కథల నెట్లు నిర్ణయించవచ్చును ?
3. మంచి యుపయోగకరముగ నుండునట్లు కథల నెట్లు బోధింతువు?
4. మంచికథలకు చెడ్డకథలకు భేదములేవి ?
5. భూగోళ పాఠమున కుపయోగించునట్లు కథలను చెప్పునపు డేవిషయములను గమనించవలయును ?

---

# 11. ప్రాథమిక విద్యాప్రణాళిక - ప్రపంచ భూగోళము - ఇండియా

ప్రపంచమంతటిని కొన్ని ప్రదేశములుగా విభజించి, యాయాప్రదేశములను గురించి వివరముగ చదువుట సులభమార్గము. ఇట్లు చేయుటకు పటమును ఆధారము చేసికొనవలయును. సాధారణముగ దిక్కులనుగూర్చిన జ్ఞానము నాలుగవ తరగతిలోనే బాలురకు కలుగును. దీనిని పటమున కనుసరింపజేసినచో నుత్తరము పటమునకు పైభాగమగుచున్నది. పటమున కెదురుగ నిలిచినచో మన కుడిచేతివైపు తూర్పు అనియు, ఎడమచేతివైపునకు పడమర యనియు బాలురచే గమనింప చేయదగును. పటమునకు క్రింది భాగమ్ము దక్షిణము. పైవిషయములను గ్రహించిన విద్యా

ర్థులు పటమునందలి ప్రదేశములన్నిటికిని సులభముగ దిక్కు లను తెలుపగలరు.

భూమి మనకంటికి గనబడునట్లు బల్లపరుపుగా లేద నియు, గుండ్రముగ నున్నదనియు తెలియజేయు వలయును. దీనికి సాధారణముగ చెప్పబడు నిదర్శనములను అనుభవ మున కన్వయింపజేసి బోధించవలయును. బంతిని, నారింజ పండును చూపి వీనితో పరిపోల్చవచ్చును. కాని యిది యుత్తర దక్షిణములలో కొలదిగా నొక్కి వేయు బడినట్లును, మధ్యభాగమున ఉబ్బియున్నట్లును తెలుపవలయును. మనకు సూర్యుడు తిరుగుచున్నట్లు కనబడును. మనము రైలులో ప్రయాణము చేయుచున్నప్పుడు ప్రక్కనున్న టెల్లిగ్రాఫు స్తంభములును, చెట్లును మనకెదురుగా ప్రయాణము చేయు చున్నట్లు కనబడునుగాదా! స్తంభములును, చెట్లును స్థిర ముగానున్నను, పరుగెత్తు రైలులోనున్న మనకవియే పరు గెత్తుచున్నట్లుకనబడును. అందుచే సూర్యుడు స్థిరముగనుండు ననియు, మనమున్న భూమియే తిరుగుచున్నదనియు, నిది పడ మరనుండి తూర్పునకు తిరుగుటచేతనే సూర్యుడు తూర్పున నుదయించి పశ్చిమమున నస్తమించునట్లు కనబడుననియు నిరూపించవలయును.

భూమి తనచుట్టు తాను తిరుగుటకు ఇరుసువంటి సాధన ముండవలయునుకదా? బండిచక్రము తిరుగుటకిదియే ముఖ్య ముగు సాధనము. బండిచక్రము చివరభాగములు కదలు చున్నను ఇరుసున కంటియున్నచో కదలిక లేదనియే చెప్ప

దగును. భూగోళమున కిట్టి యిరుసు ఉన్నట్లు ఊహింపబడి నది. దీని యుత్తర దక్షిణపు చివరలను ధృవములందురు. వీనిని కలుపుకొని భూగోళము మధ్యగానున్న దే యిరుసు అనుకొనుమని భూగోళపటమునఁగీచి నిరూపించ దగును. ఈ యంశములు బోధించుటకు దిగువనున్న పటము లవ సరము.



పశ్చిమార్థ గోళము



పూర్వార్థ గోళము

గ్లోబును ఉపయోగించుట:- గ్లోబుభూగోళముయొక్క ఆకారమునుగుర్తించుటకు సాధ్యపడును. దీనినిచూపినప్పుడే గాని వర్ణించి యెంతబోధించినను పసిబాలురకుభూగోళమును గూర్చిన సరియగువివరములను గ్రహించుటకు వీలుకలుగదు. భూమితనచుట్టు తానుతిరుగుటయు, అప్పుడు ధృవముల ప్రాంతమున కదలిక తక్కువగ కనబడుటయు, సూర్యునికి బదులుగ నుంచిన దీపము వెలుతురు భూగోళము సగముభాగమున పడుటయు, క్రమముగ నీభాగము మఱుగుపడి ఇదివఱకు మఱుగుపడిన భాగములు వెలుతురులోనికి వచ్చుటయు, నిట్లే దివారాత్రము లేర్పడుననియు దీనిసాయముననే బోధింపగలము. మఱియు పటమునందు ఏభూభాగమునకు తూర్పుగ ఏభూభాగముకలదో నిర్ణయించుట కష్టముగ నుండును. ఆసియాకు తూర్పుభాగము అమెరికా పడమటి భాగమునకు సమీపమని గ్లోబులో సులభముగ గుర్తింప జేయనగును. మఱియు కాలములు, ఋతువులును భూమి సూర్యునిచుట్టును తిరుగుటవలననే కలుగునని బోధించుటకు గూడ యిది తోడ్పడును. కావున నీతరుణమందే యుపాధ్యాయుడు గ్లోబుపరిచయమును కలిగించవలయును.

భూగోళమందలి ప్రదేశములు : భూమి సూర్యుని చుట్టును తిరుగునపుడు ఉత్తరార్ధగోళ మొకప్పుడును దక్షిణార్ధగోళ మొకప్పుడును సూర్యుని కెదురుగవచ్చును. ఈభాగములపై సూర్యుని కిరణములు సూటిగా పడుటచే వీని కివి వేసవి నెలలు. సూర్యునికిదూరమగు భాగమునకు చలికాలము ఇంతియేగాక భూమధ్యరేఖయు, దాని కిరుపార్శ్వములందును

గల కర్కాటకమకర రేఖలకును సమమనున్న భాగము సూర్యుని కెప్పుడు ఎదురుగ నుండుటచే అతి యుష్ణముగ నుండును. ధ్రువములు వాని సమీపభాగములును అతిశీతల ములుగ నుండును. సాయంకాలము సూర్యునికిరణములవలె నిచ్చట సూర్యరశ్మి తగులుచుండును. ఈ రెండింటికి మధ్య నున్న భాగమున శీతోష్ణములస్థితి సమానముగ నుండును. వీనికాయా శీతోష్ణముల ప్రభేదమునుబట్టి యా పేరు లేర్పడి నవి. వీనిని భూగోళమున గుర్తింపజేయనగును.

హిందూదేశమందలి భాగములలో దక్కను పీఠ భూమియును, ఉత్తరహిందూస్థానమున కొంతభాగమును ఉష్ణమండలమున నున్నవని నిరూపించవలయును. ఈ ప్రదేశ మునందలి సాధారణ జీవజాలము, పంటలు, జనసంఖ్య, వారివృత్తులును హిందూదేశమందు కూడ కనబడుచున్నవి. ఈ మండలమున వేడిమి యెక్కువ, వర్షమధికముగ కురి యును. పెద్ద అడవు లుండును. ఈ ప్రదేశమున ముఖ్యమగు పంట వరి. వ్యవసాయము ముఖ్యవృత్తి. జనులు సాధారణ ముగ నల్లనిరంగు గలవారు

గంగా సింధు మైదానమునందలి యుత్తర భాగమున హిమాలయపర్వతప్రాంతములును సమశీతోష్ణమండలమున నున్నవి. భూమధ్యరేఖ కిది యుత్తరమున నుండుటచే దీని నుత్తర సమశీతోష్ణమండలమందురు. ఇచ్చట యుష్ణము సామాన్యము. చలికూడ సామాన్యమే. ప్రపంచమున నీ భాగములందు అడవు లధికముగ నుండవు. విస్తారముగ పచ్చికబయళ్లు ఉండును. గావున పశువుల మందలను

గొర్రెలమందలను పెంచుచుందురు. గోధుమలీ ప్రదేశములలో విరివిగా పండును. ప్రజలు దృఢశరీరులు. రూపవంతులు. తొందరగా ఆయాసపడరు. యంత్రాలయములు, పరిశ్రమలు యిచ్చట నధికము. ప్రజలు ఉన్నిబట్టలు వాడుచుందురు. సాధారణముగ వ్యవసాయమునుకూడ సాగింతురు. మన దేశమందలి యీ భాగమున గోధుమలు, వరి, నారయును పండును. జనసంఖ్య విస్తారము. ఉత్తరమున పశువులను మేపుదురు.

హిందూదేశపటమున నీ విషయములను గుర్తింప జేయునది.

## ప్రశ్నలు

1. భూమి యాకారము నిర్దిష్టముగ బాలురు గ్రహించు నట్లేమి బోధింతువు?
2. కదలునది భూమియనియు, సూర్యుడు స్థిరముగ నుండుననియు ఋజువు చేయుము.
3. భూగోళము నెన్ని మండలములుగ విభజింపవచ్చును? వీని నెట్లు సులభముగ నిరూపింతువు?
4. ప్రపంచమందలి ప్రదేశముల జ్ఞానమును హిందూదేశమున కెట్లు అన్వయించవచ్చును? ఉదాహరణము లిమ్ము.

# 12. బోధనసామగ్రిని తయారుచేయుట

భూగోళపాఠములు జయప్రదముగను విద్యార్థుల కాకర్షకముగను ఉండునట్లు బోధించుటకు ఉపకరణములు కావలయును. విషయము లన్నియు వర్ణించుచు చెప్పినపుడు వారిదృష్టి మన పాఠముపై నిలువనేరదు. తాము గ్రహించిన విషయములనుగూర్చి నిశ్చయమగు అభిప్రాయములు కూడ గలుగనేరవు గ్లోబు మొదలగు ఉపకరణములను ప్రదర్శించి చక్కగా బోధించిననేగాని, విద్యార్థులకు భూమి గోళాకారముగ నున్నదని దృఢమగు జ్ఞానము కలుగనేరదు. పటములనుచూచియే చాలవిషయములను బాలురు గ్రహింపవలయును. ఇందుకు తగిన జ్ఞానము వారికి ముందుగ నుండుట యవసరము. అట్టి బోధనసామాగ్రి యేది ?

1. గ్లోబు:—భూగోళపాఠమున తప్పనిసరిగా నుపయోగించవలయును. రాత్రింబవళ్ళు, కాలములు, భూమధ్యరేఖకు దూరము. మండలములు అన్నియు దీనినిబట్టియే నేర్పవలయును. కనుక వివరములు గుర్తింపబడిన గ్లోబు ఉండుట యవసరము, బలపముతోగాని, సీమసున్నము, జిగురుతోగాని, గ్లోబును తయారుచేసి నల్లనిరంగులోముంచి దానిపై సీమసున్నముతో వివరము లెప్పటికప్పుడు గుర్తించవచ్చును.

2. పటములు:— ఇవియు నుపాధ్యాయునికి చాల ముఖ్యమైనవి. నైసర్గికస్థితులు, వర్షపాతము, శీతోష్ణములు,

పంటలు, వృత్తులు, రాజకీయభాగములు గుర్తింపబడిన పటములు వేరువేరుగా నుండవలయును. మన గ్రామమునకును, తాలూకాకును మనమే తయారుచేసుకొనుట మంచిది. జిల్లా పటములు, రాజధాని పటములు పలువిధములుగ తయారు చేసుకొని యుపాధ్యాయుడు ఉపయోగించవచ్చును. స్కేలు యొక్క జ్ఞానమును తప్పక కలిగించవలయును. పెద్ద పటములకు, చిన్నవానికి భేదములు లేవని బాలురు గ్రహించవలయును. అన్ని పాఠములలోను ఉపయోగించదగిన పటము నైసర్గిక స్వరూపములను తెలుపు పటము. దీని నాధారము చేసికొని మిగిలినవి బోధించవచ్చును.

3. చిత్రములు:— వీనిని ఉపాధ్యాయుడు తయారు చేయుట దుస్తరము, మంచిరకములు సంగ్రహించి యుపయోగించుట యుత్తమము. (1) మనముచేసిన వర్ణనలకు తోడ్పడి, మంచి యభిప్రాయమును కలిగించుటకును, (2) దృశ్యములను, పంటలను, వృత్తులను వివరముగ చూపుటకును, (3) నాగరికతల ప్రభేదములను గుర్తింపజేయుటకును ఉపయోగపడును. వీనిని వార్తాపత్రికలనుండియు, ఫొటోగ్రాఫులుగాను గ్రహించుట యుత్తమమగుపద్ధతి.

4 మాదిరులు (Models):—వీనిని తయారు చేయుట వలన నైసర్గికపరిస్థితులు బాలురకు కన్నులకు కట్టినట్లుండును. కాని వీనియందలి పరిమాణము సరియైనది కానేరదు. అందుచే పటముల నుపయోగించునంతవరకే వీని నుపయోగించవచ్చును. తరువాత నివి పటమునకు సహాయపడును

గాని స్వతంత్రముగ నుపయోగింపబడజాలవు. మన దేశమందలి వివరములకును, రాజధాని యందలి వివరములకును మాత్రము మాదిరులు తయారు చేయగలిగిన చాలును. శాశ్వతముగ నుపయోగించువాని పరిమాణము జాగ్రత్తతో చూచి తయారుచేయవలయును. అప్పుడప్పుడు శిఖరముల ఎత్తును, భూమ యుపరితలముస్థితిని, యితర భూగోళవిషయములను ప్రదర్శించు వానిని కాగితపుముక్కలతోగాని, బంకమట్టితోగాని చేయించవచ్చును.

5. చిత్రములపటము లేక ఏకదృష్టి ననుసరించిన పటము (Birds, eye view mod) :— దీనిని తయారు చేయుటవలన నొక్క ప్రదేశమందలి వివిధస్థలములు, కొండలు, నదులు అన్నియు కన్నులకు కట్టి నట్లుండును. దీనిలో స్కేలు క్రమముగ నుండ నేరదు. అందుచే మాదిరుల వలెనె దీనినికూడ పటమునుగూర్చి బోధించుటకు సహాయకముగ నుపయోగించవచ్చును. ఇట్టి చిత్రములు వార్తాపత్రికలలోను, రైల్వేకంపెనీల ప్రకటనలలోను కనబడుచుండును. ఉపాధ్యాయులుకూడ వీనిని తయారు చేయ చ్చును.

6. మ్యాజిక్లాంతరు:— దీని సహాయమున విదేశములందలి యపురూపములగు దృశ్యములను చూపించవచ్చును. ముఖ్యములగు భూగోళవిషయముల జ్ఞానము దీనివలన సులభముగ కలుగును. చూపించదగిన చిత్రములను (Slides) ముందుగ నిర్ణయించుకొని, వానిని ప్రదర్శించి, యందలి యంశములను గ్రహింపజేయవలయును.

7. వర్షమానిని వాయుభారమిత్రి, ఉష్ణోగ్రతను కొలుచు నుష్ణమానినులను, శీతోష్ణపరిస్థితుల నిర్ణయించుట కుప యోగపడును. వీనిని సాధారణముగ నుపాధ్యాయులే తయారు చేసుకొనవచ్చును. దిక్సూచియంత్రము, సూర్యుని స్థితిని గమనించు సాధనములును ఉపాధ్యాయులు జాగ్రత్త చేసి యుపయోగించవలసియుండును.

## ప్రశ్నలు

1. భూగోళమును బోధించుటకు పనికివచ్చు సామగ్రియేమి ?
2. గ్లోబు నేల యుపయోగించవలయును?
3. పటములు, చిత్రములు నెట్లు తోడ్పడును ?
4. ఉపాధ్యాయుడు వీని నెట్లు తయారుచేయగలడు ?
5. వర్షమానిని, ఉష్ణమానినులు – వీనియుపయోగమేమి ?

---

# 13. చేతిపని–దాని యుపయోగము

భూగోళపాఠములు నేర్పినపుడు ఉపాధ్యాయుడు విద్యార్థులచే స్వయముగ కొంతపని చేయించవలసియుండును. వారు నేర్చు విషయములు భావనాబలము ననుసరించి గ్రహింపదగినవి. స్వయముగ తా మాయా విషయములకు సంబంధించిన పనులను చేయగలిగినచో (1) వానినిగూర్చి సరియగు జ్ఞానము కలుగును. (2) క్రొత్తవిషయములను సూక్ష్మముగ గ్రహించుటకు వీలగును. అందువలన లగినంత యవకాశమును విద్యార్థులు చేతిపనికి కలిగించవలయును.

ఎట్లు చేయించవచ్చును ?

1. పటములను వ్రాయించవచ్చును. ప్రారంభదశలో ఖాళీపటములనిచ్చి, వానిలో వివరములను గుర్తింపజేయ దగును. తెలిసిన వివరములనుబట్టి రంగులు వేయించవచ్చును. నిమ్నోన్నతముల భేదమును దెలుపు రేఖలను (contour lines) వేయించ వచ్చును. తాలూకా పటము, జిల్లాపటము స్వయముగా తయారుచేయించవచ్చును. పలువిధములగు పటములను (వర్షము, పంటలు, శీతోష్ణములు, వృత్తులు, రాకపోకలు, రాజకీయ భాగములు, భాషలు) తయారు చేయించవచ్చును.

2. మాదిరిలు తయారుచేయించవచ్చును. వీని యుప యోగము నిదివరకే చూచియుంటిమి, తాము చిత్రములలో చూచి యుపాధ్యాయుని ముఖమునుండి వినిన విషయము లనుబట్టి మాదిరులు తయారుచేయవచ్చును. నైసర్గిక స్థితులు, నదీముఖము, ఉపనది, డెల్టా మొదలగు భూగోళవిషయము లను తెలుపుటకు మాదిరులు తయారుచేయించవచ్చును. దీనిని బంకమట్టితోను, తడియిసుకతోడను చేయించవలెను.

3. ఆసక్తిని గొలుపు చిత్రములను సంగ్రహించుట. వీనిని ఎంచుటలో విద్యార్థుల సామర్థ్యము బయలుపడును. ఆవశ్యకములను నిర్ణయించుటయందు దృష్టినిలుచును.

4. వాతావరణముల చార్టులను, డయాగ్రములను తయారుచేయుట—వీనిని ప్రతిదినమును చూచుచు, వివరము

లను జాగ్రత్తతో గుర్తించుచుండవలయును. వీని యుచ్ఛ స్థితిని, పతనమును గుర్తించుచు గ్రాఫులనుగీయించవచ్చును. సంవత్సరమున కింతయని యిట్టి వివరములు గుర్తింపబడియుండినచో, వానినిబట్టి యేనెలలో వర్షము లధికముగ వచునో ఎప్పుడు పైరుగాలి వీచునో, ఎప్పుడు చలికాలము ప్రవేశించునో గుర్తించవచ్చును. ఒకప్రదేశమునకుగల వివరములను బట్టి యన్ని ప్రదేశములకును నిర్ణయించవచ్చును.

బడిలో జరుగు చేతిపనులతో సంబంధము:—

1. బంకమట్టితో జంతుపృథ్వీసంపద రూపములను, గ్రహసంబంధములగు ఉపకరణములను తయారు చేయించవలయును. వివిధప్రాంతము లందలి భేదములు గుర్తించుటకు వీలుగలుగున ట్లివి యుండవలయును.

2. నైసర్గికరూపమును చిత్రించుపటములు (Relief Maps) భూమియొక్కయు నీటియొక్కయు వివిధరూపములను తయారుచేయించవలెను.

3. కాగితమును అందముగ కత్తిరించి, మడచి, సొగసైన పర్వతశిఖరములను, అడవులను, అలలతోనుండు సముద్రమును, జలపాతమును ప్రతిమలు చేయించవలెను.

4. అగ్గిపెట్టెతో రైలు, మోటారు, నదిపైనున్న వంతెన మొదలగువానిని తయారు చేయించవలెను.

5. కొండలు. వృక్షములు, పడవలు, స్టీమర్లు మొదలగునవి కాగితము కత్తిరించి చూపించవలెను.

6. అట్టముక్కలతో దిక్సూచి, సూర్యుననుసరించి కాలము కనుగొను సాధనము (Sun dial) తయారు చేయించవచ్చును.

7. మాదిరిలుగ నుపయోగింపదగిన లైటుహౌసు, నౌకాశ్రయము, రైలుస్టేషను మొదలగునవి అట్టలతో తయారు చేయించవచ్చును.

8. రంగులువేసి చిత్రములను తయారుచేయించి భూగోళ పాఠమున నుపయోగింపవచ్చును.

## ప్రశ్నలు

1. చేతిపనుల యుపయోగమేమి ?
2. భూగోళ పాఠములకు పనికివచ్చు చేతిపనులెవ్వి ?
3. సూర్యాలు చేతిపనుల కివి యెట్లు సంబంధపడి యున్నవి ?
4. మాదిరిలుగ చేయదగిన జల, భూరూపములను పేర్కొనుము.

---

# 14. బడివిహారములు

**ఉద్దేశములు :**

1. విద్యార్థులు స్వయముగ తమ పరిసరములను గూర్చి తెలిసికొనగలుగుదురు. అందుచే వారి కాసక్తి యధికమగును. తెలిసిన విషయముల జ్ఞానము దృఢపడును.

2. ప్రజల జీవితమునందలి ముఖ్యలక్షణములను తెలుసుకొనగలుగుదురు. మరియు తాము చదువుచుండు నితర ప్రదేశములందలి జీవితమునకును దీనికిని గల భేదములను గమనింతురు.

3. తెలిసిన విషయములను బట్టి తెలియని వానిని గ్రహించ గలుగుట యుత్తమ పద్ధతి – విహారములు దీని కెక్కువగా తోడ్పడ గలవు.

4. బాలుర స్వయంకృషి వృద్ధియగుటకును ఫలప్రదమగుటకును మంచి యవకాశము గలుగును.

5. బడియింటినుండి వెలుపలికి నడిచినందువలన గ్రహింపదగిన జ్ఞాన మపారముగ గలదు. తమచుట్టుపట్టులలో నున్న విషయములను బొత్తుగ నెఱుగని భూగోళ శాస్త్ర పండితులు గలరు. వారి జ్ఞానము అనుభవమున కెంతవఱకు ననుసరించి యున్నదో ఎంతవఱకు తోడ్పడునో గమనించవలయును.

6. మన పరిసరములలో గల భూగోళవిషయ జ్ఞానము ననుసరించి విదేశముల గూర్చి చదువు విషయములు గ్రహించి మానసికముగ వానిని చిత్రింపగలుగుదుము. ఈ యనుభవమే లేనినాడు మానసికముగ చిత్రింపగలుగుట దుర్లభము. కేవలము గాలిలో మేడలను కట్టవచ్చునా ?

వాసినేర్పఱచుట – నిర్వహించుటః—

1. దర్శించదగిన ప్రదేశమును, అచ్చట గుర్తింపవలసిన విషయములను ఉపాధ్యాయుడు ముందుగా తెలిసికొనవలెను.

2. అవకాశమునుబట్టి యతడచ్చటికి ముందుగావెళ్ళి, ముఖ్యవిషయములను తాను గుర్తించి యుండవలెను.

3. విహారముమధ్యను బాలురందరి నొకచోజేర్చి గుర్తింపదగిన యంశములకు వారిదృష్టిని మరల్పవచ్చును.

4. ఆప్రదేశమందలి ప్రజల జీవితమంతయు బాలురు సులభముగ గ్రహించునట్లుండ వలయును. ప్రజల యాహారము, వస్త్రములు, ఇండ్లు, జీవనమునకై చేయువృత్తులు, బాటలు–వంతెనలు, వీని యుపయోగము, నైసర్గిక విషయములు గ్రహింపజేయుట మంచిది.

5. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, రాత్రి పగలు–వీని పరిమితిలో భేదము, గాలి, వాన మొదలగు వివరములను గుర్తించు మండుటకూడ ముఖ్యావసరమే.

వీనికిగల యాటంకములుః—

1. తరగతి విద్యార్థుల సంఖ్య యధికముగ నుండినచో విహారము అనుకొనినంత జయప్రదముగ నుండజాలదు. కనుక తరగతిని విభజించి యిద్దరు ఉపాధ్యాయులు తీసికొని వెళ్ళవచ్చును.

2. బడిలో నున్నపుడే పిల్లలందరికి తగినంతపని యిచ్చుట దుర్లభమగుటచే క్రమశిక్షకు లోపముకలుగును. విహారములలో నీ లోప మధికమగును. ఉపాధ్యాయుడు వారి యందు సంతతము దృష్టిగలిగి యుండవలయును.

3. వీనికొఱకగు ఖర్చు విషయముకూడ తీవ్రమయినది. అందుచే వీనిని సాధ్యమయినంత చౌకగా నుండునట్లు చూడ వలయును.

4. యంత్రాలయములు కర్మాగారములు దర్శించు నపుడు పిల్లలు జాగ్రత్తతో మెలగవలయును; లేనిచో ప్రమాదములు తటస్థించును. అవి జరుగకుండ జాగ్రత్తపడి యుండవలెను.

మాదిరులను సంగ్రహించి ప్రదర్శించుట: — విహార ములలో విద్యార్థులు తమకుతోచిన మాదిరులు (నీటిలోను భూమిలోను దొరుకు వస్తువులు, మొక్కలు, లతలు, ఫల ములు) సంగ్రహించి పాఠశాలలో ప్రదర్శించుట మంచిది. అచ్చట లభించిన చిత్రములను, వార్తాపత్రికలనుండి గ్రహిం చిన వానిని ప్రదర్శించు నలవాటు కలిగియుండవలయును. సంగ్రహించినవానిని చిత్రవస్తు ప్రదర్శనమున నుంచుటకు సాధారణముగ పాఠశాలలో అవకాశముండదు. కావున వానినిగురించి వివరించు నోట్సువ్రాసి, గోడలకు తగి లించుటగాని, వాని కమర్చిన బల్లలపై ప్రదర్శించుట గాని చేయవలయును. పటములు, మాదిరులతోబాటు వీనినిగూడ నిలువచేసి సమయానుకూలముగ నుపయోగిం

చుట గ్రామపాఠశాలలో జరుగుపని. ఇంతకంటె యెక్కువ యుపయోగకరముగను ఆకర్షకము గను ఉండునట్లు ప్రదర్శించుటకు తగిన స్థలము దొరకదు.

## ప్రశ్నలు

1. విహారములు భూగోళ పఠనమున కెట్లు సాయపడును?
2. వీని నేర్పరచు నుపాధ్యాయుడెట్లు ముందు జాగ్రత్త తీసికొన వలయును?
3. విహారములు జరుపుట కాటంకములేవి? వాని నెట్లతిక్రమింపవచ్చును?
4. చిత్రములను, మాదిరులను గ్రామపాఠశాలలో నెట్లు ప్రదర్శింపవచ్చును?





Das Art Press, Tenali. G 43 C 1500—6—47